

# తెలుగు స్వతంత్ర

## విషయసూచిక

సంపుటి 2. సంచిక 10.

శుక్రవారం, అక్టోబరు 7, 1949

పుట



న్యాయవిచారణ - కార్యనిర్వాహక శాఖల విభజన మద్రాసు ప్రభుత్వం వారు చెంగల్పట్టు, ఉత్తర ఆర్కాట్ జిల్లాలలో యీ నెల 2 వ తారీకునుండి అమలుపరచారు. ఇక్కడి రెండు చిత్రాలూ చెంగల్పట్టులో సంస్కరణ ప్రారంభోత్సవ సమయంలో తీసినవి.

(పైన): గౌ॥ ప్రధానన్యాయమూర్తి శ్రీ, పి. వి. రాజమన్నారు, స్థానిక న్యాయవాదుల సంఘం సెక్రటరి, జిల్లాజడ్జి శ్రీయుత పి. యస్. రామస్వామి మొదలైనవారిని కాననగును.

(క్రింద): గౌ॥ మంత్రి శ్రీ భక్తవత్సలంగారు ఉపన్యసిస్తున్న దృశ్యం.



# తెలుగు స్వతంత్ర

సంపుటి-2
సంచిక-10

అక్టోబరు 7, 1949

ప్రచురణ:
ప్రతి శుక్రవారం


## శ్రుతిమించిన రాజకీయాలు

అసలు పాకిస్తాను ఏర్పడటమే కుటిల రాజకీయాల ఫలితంగా ఏర్పడింది. ద్వేషంతోనూ, తిట్లతోనూ, చవుకబారు బెదరింపులతోనూ, తంపులు పెట్టే పై వాళ్లరహస్యసహకారంతోనూ తలా తోకా లేని వాదనలతోనూ జిన్నా సాహెబు పాకిస్తానంటూ ఒకటి ఏర్పాటు చేసి పోయినాడు.

ప్రత్యేక రాజ్యం లభించటమే ఆలస్యంగా పాకిస్తాను మహా నాయకులు, ఇండియాలో దిగబడిపోయిన లక్షలాది ముస్లిముల గతి ఆలోచించక - వారిని పాకిస్తానుకు రానివ్వమనికూడా ప్రకటన చేసి – పాకిస్తానులోని హిందువులపై హింసాకాండ సాగించారు.

ఆటుతరువాత హైదరాబాదులో కుట్ర సాగించారు. హైదరాబాదును మరొక పాకిస్తానుగా తయారుచేయటానికి ప్రయత్నించారు. అటు కాశ్మీరు మీద ఇదే వాసనగల రాజకీయ ఎత్తులు ప్రయోగించారు. పాకిస్తాను రాజకీయాలను ఎత్తులనటంకన్న జిత్తులనటం సబబుగా ఉంటుంది. రాజకీయంగా గెలుపు సాధించటానికి ఎటువంటి అసత్యాలనైనా సరే జంకకుండా ప్రచారం చేయటమూ, ఎటువంటి నీచాలకైనా పాల్పడటమూ పాకిస్తాను ట్రేడు మార్కుగా పరిణమించింది. ఐక్యరాజ్య సమితిలో స్థానం సంపాదించడంలో పాకిస్తాను రాజకీయాల దుర్గంధం అంతర్జాతీయ చర్చలలోకికూడా పాకింది.

కాశ్మీరులోవారు చేసిన ఘోరాలూ, పాకిస్తాను విడిచివచ్చిన కాందిశీకుల ఆస్తులను దిగమింగటానికి పాకిస్తాను ఎత్తిన ఎత్తులూ, ఇండియా పాకిస్తానులమధ్య జరిగే వ్యాపారం చెడటానికి పాకిస్తానులో జరిగే యత్నాలూ, రూపాయి విలువ తగ్గింపు మూలంగా లాభం చేసుకుంటామని పాకిస్తాను చేస్తున్న కుయుక్తులూ అందరూ ఎరిగినవే.

ఒక పాకిస్తానుతోనేగాక ఇతర దేశాలన్నిటితోనూ ఇండియా ఎంతో పెద్దమనిషితరహాగానూ, ఆత్మగౌరవంతోనూ ప్రవర్తిస్తున్నది. కాని దురదృష్టవశాత్తూ ఇంకా అంతర్జాతీయ రాజకీయాలలో సైనిక బలానికీ, కుట్రచేసే శక్తికీ ఉండే పలుకుబడి పెద్దమనిషి తరహాకు లేదు. పాకిస్తాను ఇండియా, కాశ్మీరుల విషయంలో అవలంబిస్తున్న రౌడీ రాజకీయాలవల్ల పాకిస్తాను అంతర్జాతీయ "ఖ్యాతి"కి భంగమేమీ కలుగు

తున్నట్టు కనపడదు. మీదు మిక్కిలి బ్రిటనులోనూ, అమెరికాలోనూ పాకిస్తానుకు అనుకూలంగా ప్రచారంచేస్తూ ఇండియాపై దుమ్ము చల్లటానికి సిద్ధంగా ఉన్న పత్రికలు చాలా ఉన్నట్టు కనిపిస్తుంది.

ఇటీవల ఒక "పెద్ద మనిషి" అయిన రాజకీయవేత్త, అమెరికాలో ఒక ప్రసిద్ధ పత్రిక ప్రచురించిన సంపాదకీయానికి జవాబుగా, పాకిస్తాను అవలంబిస్తున్న రౌడీ విధానాన్నీ, ఇండియా పెద్దమనిషి తనాన్నీ విశదీకరిస్తూ ఒక లేఖ రాశాడు. పాకిస్తాను ఏ విధంగా తన సైన్యాలను కాశ్మీరుమీదికి పంపి తనకేమీ తెలియదని అబద్ధాలాడింది, కాశ్మీరు కమిషను తీర్మానాన్ని ఏవిధంగా పాకిస్తాను వ్యతిరేకించింది, కాశ్మీరు కమిషనువారు పాకిస్తాను తప్పును ఏవిధంగా కప్పిపుచ్చుతున్నదీ వివరించి చెప్పాడు.

ఇదంతా ఈవిధంగా ఎందుకు జరుగుతున్నది? ఐక్య రాజ్యసమితివంటి పరువుగల సంస్థ నియోగించిన కమిషను వారు కాశ్మీరులో అడుగు పెట్టగానే పాకిస్తాను పక్షపాతులై ఇండియాకు ద్రోహం ఎందుకు తలపెట్టారు? ఈ అంతర్జాతీయ కమిషనుకు సంబంధించిన ఒక పెద్దమనిషి తన మానమర్యాదలు కూడా పాటించకుండా, కాశ్మీరు ప్రభుత్వం శత్రువుగా ప్రకటించిన ఒక పెద్దమనిషి సొత్తును ఆ ప్రభుత్వానికి తెలియకుండా పాకిస్తానుకు చేరవేయటం ఎందుకు జరిగింది?

ఒకప్పుడు మన దారిద్ర్యమూ, వెనుకబాటూ పాశ్చాత్య దేశాలను ఆకర్షించాయి గాని బ్రిటిషు వారు మనలను ఇతర దేశాల బారినుండి కొంతవరకు, స్వార్థంతోనే కానివ్వండి, కాపాడారు. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఇండియా బైరాగుల సత్రం అనే భావన ఒకటి ప్రచారంలోకి వచ్చినట్టు కనిపిస్తుంది. ఈ భావన కలిగినమాట నిజమైతే పాకిస్తాను రౌడీ రాజకీయాలు దాన్ని మరింత బలపరచటంలో ఆశ్చర్యం ఉండదు.

ఇండియా యెడల పాశ్చాత్య దేశాలకు భయభక్తులు కలగవలసిన అవసరం ఉంది. ముఖ్యంగా పాశ్చాత్య దేశాలు ఇండియాపట్ల తగిన గౌరవంతో మసలుకునేటట్టు చెయ్యాలి. ఇండియాలో అడుగు పెట్టిన మరుక్షణం తాము ఎట్లా ప్రవర్తించినా తమ ఆత్మగౌరవానికి హాని ఉండదనే దురభిప్రాయం వారికి కలగరాదు. ఇటువంటి గౌరవం ఇండియాకు చేకూరాలంటే రెండే మార్గాలు—ఒకటి, ఇండియా సాయుధ బలం ప్రదర్శించటం; రెండవది, దేశప్రజలందరినీ కూడగట్టే దేశీయ, అంతర్జాతీయ విధానాలు అవలంబించటం. ఇందులో మొదటి పద్ధతి అనేక కారణాల చేత పొసగదు. అది మనకు అవసరం లేదు. అణువు బాంబులతో వచ్చే కీర్తికోసం మనం అమెరికాతో పోటీ చేయలేం. కాని రెండవ పంథా పోటీలేని పంథా. ఈ పంథా తొక్కిన అన్ని దేశాలకూ అంతర్జాతీయ గౌరవ మర్యాద లున్నాయి. అమెరికా రాజకీయాలను అమెరికనులూ, రష్యా రాజకీయాలను రష్యనులూ, బ్రిటను రాజకీయాలను బ్రిటిషువారూ గట్టిగా బలపరుస్తారు. చైనా అంత పెద్ద దేశమై కూడా అంతఃకలహం మూలంగా అంతర్జాతీయంగా అనామకంగా ఉండిపో

యింది. రేపు, కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని చైనా ప్రజలు బలపరిచినట్టయితే చైనాకు తప్పక అంతర్జాతీయ ఖ్యాతి వస్తుంది. ఇండియా విభజన ద్వారా చాలా ఖ్యాతిని పోగొట్టుకున్న దనటానికి సందేహం లేదు. ఈ ఖ్యాతిని ఇండియా తిరిగి సంపాదించాలి.

ఇప్పటికైనా ఇండియాకున్న పలుకుబడి కేవలం దేశవిస్తృతిని బట్టి రాలేదు. ప్రస్తుతానికి ప్రభుత్వానికి ప్రతిపక్షం లేకపోవటమూ, 35 కోట్ల ప్రజలకు నెహ్రూ ఏకైక నాయకుడుగా ఉండటమూ చాలా వరకు తోడ్పడ్డాయి. కాని ఇకముందు ఈ పునాది చాలదు. ఈఖ్యాతి కూడా దూరాన రాణించినంతగా దగ్గరలో రాణించదు. ఇకముందు ప్రజలు ఎన్నుకొనే ప్రభుత్వం అవలంబించే విధానాలను ప్రజలందరూ బుద్ధిపూర్వకంగా బలపరచాలి. ఎట్టి తీవ్రపరిస్థితి వచ్చినా ప్రజలు ప్రభుత్వం వెనకే ఉంటారనే విశ్వాసం కలగాలి. ఆ విధంగానే ఇండియా తన అంతర్జాతీయ ఖ్యాతిని హెచ్చించుకో గలదు. అటువంటి దేశమే ఆర్థికంగానూ, రాజకీయంగానూ కూడా ముందుకు సాగలుగుతుంది.

---

## చర్విత చర్వణం

ప్రత్యేకాంధ్రరాష్ట్రం విషయమై నాయకత్రయం తయారుచేసిన నివేదికలోని సూచనలకు భిన్నమైన తీర్మానాన్ని కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ ఆమోదిస్తుందేమోననే భ్రాంతి హాస్యాస్పదం. ఇటీవల సమావేశమైన ఆ కమిటీ వెనకటి సూచనలనే పునరుద్ఘాటించింది. వివిధ ఆంధ్రసంస్థలవారు తీసుకువెళ్ళిన రాయబారాలకు నాయకుల దర్శనం లభించకపోలేదు; సావధాన చిత్తులై స్తవనీయమైన ఓర్మితో, నాయకులు నివేదికలన్నీ పరిశీలించారు; తమ చేతనైనదంతా చేయగలమని వాగ్దానాలు యివ్వడంకూడా జరిగింది. ఆఖరుకు తేలిన సారాంశం మొదట ఏనాడో తేల్చినదే: ఆంధ్రులు మద్రాసుపైగల హక్కును వదలుకోవాలి; లేనినాడు రాష్ట్రసిద్ధి జరగదు. ఆ మధ్య డాక్టర్ సి. ఆర్. రెడ్డిగా రభిప్రాయపడినట్లు, న్యాయసూత్రాలకు బద్ధమై ఉండడంకంటె, కొందరు వ్యక్తుల అనుగ్రహాలకు అనుగుణంగా నేటి ప్రభుత్వనీతు లుండడం నిరాశాకరం. ప్రజాస్వామికమైన న్యాయ సూత్రాలను అన్వయించి పరికిస్తే, మద్రాసు ఎవరిదో తేల్చడానికి ప్రమాణాలు పురాతత్వ శాస్త్రవేత్తల పరిశోధనలూ కావు, నాయకుల ఇచ్ఛావిలాసమూ కాదు; మద్రాసులో నేడు నివసించే అశేషప్రజానీకపు అభిప్రాయం. వయోజనులందరికీ ఓటింగు హక్కు నిచ్చి, "రెఫరెండం" జరిపించిన నాడు, మద్రాసుసమస్య నిర్దుష్టంగా పరిష్కారం అవుతుంది. రెఫరెండం తమ కనుకూలంగా ఉంటుందనే పూర్ణ విశ్వాసం ఆంధ్ర నాయకులకు లేని నాడు, తాము కాలాని కెదురీదుతున్నామని గ్రహించి, నాయకత్రయం సూచించిన షరతుల కంగీకరించి వివాదగ్రస్తం కాని ప్రదేశాలతోనైనా వెంటనే ఆంధ్రరాష్ట్రం నిర్మించడానికి తోడ్పడ్డం వారి కనీస ధర్మం.

ఆలాపన

# దృశ్యకావ్యాలు

ఆరుద్ర

శ్రవ్యకావ్యాలకూ దృశ్యకావ్యాలకూ ప్రయోజనంలోనే చాలా వ్యత్యాసం కనబడుతుంది. శ్రవ్యకావ్యాలు జనపద సుఖబోధ్యం కాకపోవచ్చు. గూఢశబ్దార్థసంపన్నం అవవచ్చు. వాటి సౌందర్య సందేశాల నాస్వాదించడానికి ప్రత్యేక విద్యా సంస్కారాలున్న సహృదయుడు కావలసి ఉండవచ్చు. అయినా వాటికి జన బాహుళ్యంలో ప్రచారం కలగడానికి సమిష్టి ప్రయోజనాలకు వినియోగపడడానికి వ్యాఖ్యాత అవసరం అని తెలుసుకొన్నాం. నారికేళపాకాన్నికూడా వ్యాఖ్యాత అరటిపండు ఒలిచినట్టు సామాజికుడికి చెప్తాడు.

దృశ్యకావ్యాల సంగతి వేరు. ఇందులోనూ కావ్యాన్ని వ్యాఖ్యానించడం అన్నది లేక పోలేదు. ఆపని నటీనటులు చేస్తారు. కానీ కాలం పరిమితం. అందుకే భరతముని దృశ్యకావ్యాల గురించి

మృదులలిత పదాఢ్యం గూఢ శబ్దార్థహీనం
జనపద సుఖబోధ్యం యుక్తిమత్ నృత్య యోజ్యం
బహుకృత రసమార్గ సంధి సంధాన యుక్తం
సభవతి శుభకావ్యం నాటక ప్రేక్షకాణాం.

అని ఆదేశించేడు. ఇందులో 'ప్రేక్షకాణాం' అన్న పదం చాలా ముఖ్యమైనది. పాఠకులు గానీ శ్రోతలుగాని అయిన కాదు భరత ముని ఇంకొక విధంగా చెప్పి ఉండేవాడేమో. 'గూఢ శబ్దార్థహీనం' 'జనపద సుఖబోధ్యం' అన్న లక్షణాలు పాత్రోచిత భాషకు అడ్డు తగలడం సంభవించవచ్చు అనే అనుమానానికి అవకాశం లేకపోలేదు. కన్యాశుల్కంలో మధుర వాణి ఇంట్లో వివిధ సంస్కారాలూ సంప్రదాయాలూగల మధురవాణి, పోలిసెట్టి, భుక్త, పూజారి గవరయ్య మొదలైన వాళ్ళు కూర్చొని చీట్లాట ఆడుతున్నారు. అప్పుడు భుక్త ఒక సందర్భంలో 'తృప్తికాచ మే' అన్న ఒక్క పదంతో సమాధానం చెప్తాడు. ఈమాట గూఢశబ్దార్థ సహితం, జనపద సుఖబోధ్యం కాదు; అయినా పాత్రోచితం. కన్యాశుల్కం నాటక ప్రేక్షకులకు నిర్దేశించబడిన శుభ కావ్యం. అక్కడక్కడ ఇతరేతర సంస్కారాలకు చెప్పిన అర్థమవని కొన్ని ప్రయోగాలున్నా మొత్తం మీద సుఖబోధ్యం అవుతుంది.

నటీనటుల హావభావ చేష్టలవల్ల ఇటువంటి పదాలు బోధపడడం జరుగుతుంది. గిరీశం పాత్రోచితంగా ఇంగ్లీషు పదాలూ వాక్యాలూ అశేషంగా కన్యాశుల్కంలో దొర్లుతాయి. అవి నాటక ప్రేక్షకుల ఆస్వాదనకు అడ్డురావా? రావచ్చు. రాకపోవచ్చు. నా అతి చిన్న తనంలో నేను తొలిసారి కన్యాశుల్కం చదివి నప్పుడు ఇంగ్లీషుపదాలు దొర్లిన సందర్భాలలో వాటిని దాటేసితక్కిన నాటకం చదువుకొన్నాను. అవగాహన పెరగనినాటికే ఆకావ్యం ఎంతో ఆనందాన్ని ఇచ్చింది. అలాగే పాండవ నాటకాలలో పద్యాలుమినహా వచనం చదువుకొన్నాను. తీరా ఒకసారి నాటకం చూస్తున్నప్పుడు ఉద్యోగ విజయాలలోని పద్యాలకు వన్సుమోరులు కూడా కొట్టేను. నాటికి ఆ పద్యాలలోని అర్థం బోధ పడక పోవచ్చుగానీ నటుడి వాచకమే, గానమే కావ్యానికి వ్యాఖ్యానం అయింది. సమగ్రంగా అర్థమవకపోయినా కలిగించ వలసిన ఉద్రేకం కలిగిస్తుంది నటన. అందుకే పాత్రోచితభాష 'గూఢశబ్దార్థ హీనం', 'జనపద సుఖబోధ్యం' అన్నలక్షణాలకు అడ్డురాదు. సరికదా పాత్రోచితభాష వాడనివాడు కావ్యం సంపూర్ణ సౌందర్యం పొందదు.

'జనపద సుఖబోధ్యం' అన్న లక్షణానికి వీలుగా మరీ ప్రాథమికంగా మన వీధినాటకాలు ఉంటాయి. అందులో ప్రతి కొత్త పాత్రా ప్రవేశించినప్పుడు ఆ పాత్ర ప్రవేశిస్తున్నట్టు ఒక పాట, ప్రవేశించేక సూత్రధారుడు పాత్రకి ఎదురు వెళ్ళి "ఎవరయ్యా! మీరు!" అని ప్రశ్నించడం "ఇదే, నేను శ్రీకృష్ణ భగవానుడనురా!" అని ఆ పాత్ర సమాధానం చెప్పడం, "మీరు శ్రీకృష్ణభగవానులు అయితే ఆయేరు

గాని ఇక్కడ కొంతకు విజయం చేకూరదు అని సూత్రధారుడు అడగడం అతడు వివరించడం కద్దు. నేడు ఇంత అతిగా దృశ్యకావ్యాలలో విశదీకరించ వలసిన పని లేదు గానీ నేటి కొత్త కళారూపం అయిన శ్రవ్యరూపకానికి రమారమి ఇంత సౌలభ్యం అవసరం.

దృశ్యకావ్యాలలో అందుబాటులో ఉన్న కొత్తరూపం చలనచిత్రం. చలనచిత్ర కావ్యానికి భరతముని ఆదేశించిన లక్షణాలన్నీ అక్షరాలా వర్తిస్తాయి. చలనచిత్ర నిర్మాతలు తమ కావ్యాలకి ప్రేక్షకుల అభిరుచే ఆయువుపట్టు అని టంకశాలలో గుర్తించి చాలా కాలం అయింది. చలనచిత్రాలలో శుభకావ్యాలు వచ్చిననాడు పై లక్షణాలన్నీ ఉంటాయి.

# కృష్ణానది వరదలు

కృష్ణానది విజృంభించి ప్రళయరూపం దాల్చింది. మహాప్రవాహంగా వచ్చిన కృష్ణవేణీని తల్లి క్రోధానికి గురై లక్షలాది ప్రజలు వర్ణించలేని బాధలకు గురయ్యారు. గ్రామాలకు గ్రామాలే నీళ్ళలో మునిగిపోయాయి. ఇళ్లు పడిపోయాయి. పాడిపశువులు-దుక్కిటెద్దులు- మేకలు- గొర్రెలు మున్నగు జీవరాశులు లక్షలాదిగా మరణించాయి. ప్రజలెన్నో విధాలుగా కష్టనష్టాలకు గురయ్యారు. పెట్టె బేడలు- పరుపు సామానులు- ఇళ్ల వాకిళ్లు- ఆహారసామగ్రి- అనేకం కొట్టుకుపోయాయి. కొద్దిమంది మొదట మేల్కొన్నవారు మాత్రం త్వరగా కొంత సామానును బయటకు చేరవేసుకో గల్గారు. మిగతావారు ప్రాణాలతో బయటకు చేరటమే కష్టమనిపించింది.

ఇంతకుపూర్వము 1903 వ సంవత్సరంలో కృష్ణానదికి ఇదే విధంగా వరదలు వచ్చాయి. అప్పుడు బెజవాడ దగ్గర ఆనకట్టమీద 23½ అడుగుల ఎత్తు నీరు వచ్చింది. తరువాత 1914 లో మరొకసారి వరద వచ్చింది. అప్పుడు ఆనకట్టమీద 21 అడుగుల ఎత్తు నీరు ప్రవహించింది. ఇప్పుడొచ్చిన వరద నీటి రెంటి కంటే అధికంగా వున్నదని ప్రజలు చెప్పుకుంటున్నారు.

మన దేశంలోవున్న అన్ని నదులకూ ఏదో ఒక సమయంలో ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక ప్రాంతంలో ప్రతిసంవత్సరం వరదలు వస్తూనే వున్నాయి. ప్రజలు బాధపడుతూనే ఉన్నారు. కష్టనష్టాలకు గురి అవుతూనే వున్నారు. తినేందుకు తిండి లేక- ఉండేందుకు ఇల్లు లేక- కట్టుకునేందుకు బట్ట లేక మహాప్రవాహం నుండి బ్రతుకుజీవుడా అని బయటకు వచ్చి పడరాని బాధలు పడుతూనే వున్నారు. ఆ పంచ పాండవులా కడి దయాధర్మంకోసం ఎదురుచూస్తున్నారు. ఇలాంటి యీబాధలవల్ల ప్రజలకేవిధమగు నష్ట- కష్టాలు రాకుండా తేలికలో సముద్రంలోకి పోవటానికి వీలుగాను ఉండటానికిగాను అనేక నదులకు- అనేకచోట్ల ఆనకట్టలు కట్టడం అవసరము. అలా చేస్తే వరదలు ఇంత మహోద్ధృతంగా రావు.

ఆనకట్టలు కట్టటానికి, వీటి కట్టలు ఎత్తుగానూ- వెడల్పుగానూ- గట్టిగానూ వుండేట్లు నిర్మించటానికి ఇదివరకు విదేశీయ ప్రభుత్వం ఎంతడబ్బు ఖర్చు చేయవలసివుంటుందో లెక్కవేసుకునేది. ఆపని చేయటంవలన తనకు లాభమో నష్టమో, అందుకుగాను పెట్టిన పెట్టుబడికి తగిన వడ్డీ మాత్రమే వస్తుందో, అదనంగా లాభం వస్తుందో, అంచనాలు వేసుకుంటూవుండేవాళ్లు. మన దేశ శ్రేయస్సును, ప్రజల బాగును కోరక తమ స్వలాభానికి, సామ్రాజ్య రక్షణకే మాత్రమే ప్రాధాన్యమిస్తూ విషయాన్ని పరిశీలించటంవలన ఇలాంటి పనులను శాశ్వతంగా పరిష్కరించటానికి పూనుకోలేదు.

అనేక నదులకు అనేకచోట్ల ఆనకట్టలు కట్టటంవలన వరదల ప్రమాదం వుండదు. నిలవ నీరును కాలువలద్వారా భూముల్లోకి మరల్చటం వలన అదనంపంటలు కూడా పండించవచ్చును. ఇప్పుడు వరదలమూలంగా నష్టపడిన ప్రజలు తిరిగి ఇళ్లు కట్టుకునేందుకు ఆర్థికంగా సహాయం చేస్తూ ప్రభుత్వం యీ సమస్యలను శాశ్వతంగా పరిష్కరించడానికి పూనుకోవటం అవసరము.

—రావెళ్ల హనుమంతరావు

# సాయుధవిప్లవం - సాంఘికాభివృద్ధి

మోపర్తి వెంకటరమణయ్య

విప్లవాన్నిగురించి చర్చించే ముందు అసలు విప్లవమంటే యేమిటో తెలుసుకోవటం అవసరం. ఈ సందర్భంలో రెండు విషయాలు గుర్తుంచుకోవాలి-(1) సంఘ నిర్మాణంలోను, ప్రభుత్వవిధానంలోను మార్పు తెచ్చే ప్రతి తిరుగుబాటూ విప్లవంకాజాలదు. (2) విప్లవానికి సాయుధమైన తిరుగుబాటు, తప్పనిసరిగా రక్తపాతం లక్షణాలు కాకూడదు. సాధారణంగా 'విప్లవం' అనే మాటను ఒక పెద్ద తిరుగుబాటు అనే అర్థంలో వాడటం పరిపాటి అయింది; కాని యిది సరికాదు. విప్లవం అనే పదము పరిణామ దశను తెలియజేస్తుంది. అప్పుడున్న స్థితి కంటె ఉత్తమమైన స్థితికి కొనిపోయిన తిరుగుబాటు మాత్రమే విప్లవమౌతుంది. అంతే కాని ప్రతి తిరుగుబాటూ విప్లవం కాజాలదు. ఇందుకుదాహరణగా రష్యాలో బోల్షివిక్ తిరుగుబాటుకు, జర్మనీలోని నాజీ తిరుగుబాటుకు ఉన్న వ్యత్యాసం పరిశీలించవచ్చును. బోల్షివిక్ తిరుగుబాటు ఫలితంగా రష్యా సామాజిక వ్యవస్థలో అంతకు ముందు కంటె అభివృద్ధికరమైన మార్పు తీసుకొని రాబడింది. కాబట్టి యిది విప్లవమని చెప్పుకోవచ్చు. నాజీ తిరుగుబాటు ఫలితంగా జర్మనీ సామాజిక వ్యవస్థలో కలిగిన అభివృద్ధికరమైన మార్పేమీ లేదు. పైగా అంతకు ముందున్న దానికంటె అభివృద్ధి నిరోధకమైన సామాజిక వ్యవస్థ స్థాపించబడింది. అందువలన నాజీ తిరుగుబాటును విప్లవమనడానికి వీలులేదు. దీనిని ప్రత్యాహార విప్లవము (కౌంటర్-రివల్యూషన్) అంటారు. ఇంక సాయుధమైన తిరుగుబాటు మాత్రమే విప్లవమనిగాని, విప్లవం రక్తపాతంతోనే తప్ప జరుగ వీలులేదని కాని అనుకోవడం తప్పు. సామాజికవ్యవస్థలో అభివృద్ధికరమైనమార్పు తెచ్చేందుకు రష్యాలో కమ్యూనిస్టు పార్టీ, బ్రిటన్‌లో లేబర్ పార్టీ అనుసరించిన విధానాలను గనుక పరిశీలిస్తే యిది తేలికగా బోధపడుతుంది. రష్యాలో కమ్యూనిస్టుపార్టీ సాయుధమైన తిరుగుబాటుద్వారా పై లక్ష్యాన్ని సాధించ బూనుకుంటే, బ్రిటిష్ కార్మికపక్షం శాంతియుతంగా, చట్టసమ్మత పద్ధతులద్వారా లక్ష్యసాధనకు బూనుకున్నది. 1945 ఎన్నికలలో కార్మికపక్షం అఖండవిజయము పొంది సోషలిస్టు సమాజస్థాపనకు బూనుకోవటంతో బ్రిటన్‌లో ఒక విప్లవం జరిగిందని చెప్పవచ్చును. విప్లవం శాంతియుతంగా, ప్రజాస్వామ్య విధానంద్వారా జరిగినందున స్థూలదృష్టికి యిది విప్లవంగా కనపడకున్నా యథార్థంగా యిది ప్రశాంత విప్లవం.

పై చర్చనుబట్టి విప్లవాలు రెండు విధాలని తేలుతున్నది - ఒకటి సాయుధ విప్లవము (ఇన్‌సరెక్షన్), రెండవది ప్రజాస్వామ్య విధానాన్ని అనుసరించి ప్రజల సమ్మతిద్వారా కొనసాగించబడే విప్లవం. మనదేశంలో నేడున్న పక్షాలలో కొందరు ముఖ్యంగా కమ్యూనిస్టులు, రివల్యూషనరీ కమ్యూనిస్టులు, ట్రాట్‌స్కీవాదులు మొదలైనవారు-సాయుధ విప్లవం కొనసాగించాలంటే, మరి కొందరు - సోషలిస్టులు, రాడికల్ హ్యూమనిస్టులు-ప్రశాంత విప్లవం కొనసాగించాలంటున్నారు. నేటి పరిస్థితులలో పై రెండిటిలోను యేది సాధ్యము, వాంఛనీయము అన్నది చర్చనీయం.

మొదట సాయుధవిప్లవవిషయం పరిశీలిద్దాం. అసలు సాయుధ విప్లవం అనేది ఫ్రెంచి విప్లవ సంప్రదాయాలలో ఒకటి. అయితే ఫ్రెంచి విప్లవ ప్రభావం సజీవంగా ఉన్న 19వ శతాబ్దపు తొలి అర్ధభాగంలో తయారుచేయబడిన కమ్యూనిస్టు మానిఫెస్టో సామాజిక వ్యవస్థలో మార్పు తెచ్చే సాధనగా సాయుధ విప్లవాన్ని స్వీకరించింది. ప్రభుత్వం అనేది దేశ ఆర్థిక జీవనాన్ని గుప్పిట్లో యిరికించుకున్న వర్గము తన అధికార రక్షణకు వినియోగించుకొనే ఒక సాధన కాబట్టి ముందుగా ప్రభుత్వాన్ని కూలద్రోస్తేనే కాని సామాజిక వ్యవస్థలో మార్పు చేయుటం సాధ్య

పడదని మార్క్స్ భావించాడు. అయితే ప్రభుత్వం అధికార నిర్వహణకు సాధనం కాబట్టి హింసతోనే కాని దానిని పడగొట్టటం సాధ్యం కాదని కూడా నిర్ణయించబడింది. నాటినుండి నేటివరకు కమ్యూనిస్టులకు సాయుధ విప్లవమే సాధనగా ఉన్నది.

అయితే ఫ్రెంచి విప్లవానంతరం 80 సంవత్సరాలకే సాయుధ్ధ విప్లవం జయప్రదమగుట అనుమానాస్పదమని వెల్లడి అయింది. 1789లో జరిగిన ఫ్రెంచి విప్లవంలో ప్రజ చేతికి అందిన ఆయుధాలతో 16వ లూయీ సైన్యాలపై తిరుగబడి జయించారు. కాని 1870 సంవత్సరంలో జరిగిన పారిస్ కమ్యూన్ పూర్తిగా అణచివేయబడింది. పోరాటపు శక్తుల సంబంధంలో కలిగిన మార్పే యిందుకు ప్రధాన హేతువు. ఫ్రెంచి విప్లవం నాటి బోర్బన్ ప్రభువుల సైన్యాలకు, పారిస్ కమ్యూన్ నాటి ప్రష్యన్ సైన్యాలకు ఎంతో భేదా ఉంది. అప్పటికే యుద్ధ విధానంలోను, సైనిక శిక్షణలోను, యుద్ధ పరికరాలలోను చాలా అభివృద్ధి జరిగింది. క్రమశిక్షణతో, మారణాయుధాలతో గల రాజ్య సైన్యాలను ఎదుర్కొని సామాన్య ప్రజలు చేతికి అందిన ఆయుధాలతో పోరాడి జయించటం అసంభవమని తేలిపోయింది. ఇదే కారణంగా రెండు ప్రపంచ యుద్ధాల మధ్యకాలంలో యూరపులో చెలరేగిన విప్లవాలన్నీ (ఒక్క రష్యాలో తప్ప) ఘోరపరాజయం పొందినవి. జర్మనీ, ఫిన్‌లాండ్, హంగరీ, ఆస్ట్రియా, స్పెయిన్ మొదలైన దేశాలలో సంభవించిన సాయుధపు తిరుగుబాటులన్నీ పూర్తిగా అణచి వేయబడినవి.

ఒక్క రష్యా విప్లవానికి మాత్రం కొన్ని ప్రత్యేక అనుకూల పరిస్థితులు తోడ్పడినవి. ముఖ్యంగా జర్మనీపై యుద్ధంలో జారు చక్రవర్తి సైన్యమంతా చితికిపోయింది. దేశంలో నలుమూలలా తిరుగుబాట్లు చెలరేగినవి. ప్రభుత్వోద్యోగులలో అవినీతి, అసమర్థత ప్రబలిపోయాయి. ఇట్టి పరిస్థితులలో ఏ ప్రభుత్వమైనా, ఏమాత్రపు తాకిడికైనా కూలిపోక తప్పదు. దీనికితోడు కేపిటలిస్టు ప్రభుత్వాలు తమలో తాము పోట్లాడుకుంటూ ఉండటం వలన తక్షణం జోక్యం కలిగించుకునే స్థితిలో లేవు. యుద్ధానంతరం విప్లవాన్ని అణచ ప్రయత్నించినను పరస్పర అనుమానాల వలన, ఐక్యహీనత వలన, స్వదేశాలలో ప్రజలు వ్యతిరేకించుట వలన తమ ప్రయత్నం జయప్రదంగా కొనసాగించ లేకపోయినవి. ఈ అనుభవాన్ని ఆధారంగా తీసుకొని మూడవ అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థవారు- లెనిన్‌తో సహా- సాయుధ విప్లవం జయప్రదం కావాలంటే ఏ దేశమైనా ముందుగా సైనిక పరాజయం పొందటం అవసరమని సిద్ధాంతీకరించారు. కాని 1918లో జరిగిన జర్మనీ విప్లవం యీ అభిప్రాయం కూడా పూర్తిగా పొరపాటని రుజువు చేసింది. 1918లో జర్మనీ యుద్ధంలో ఓడిపోయింది. కాని సైన్యాలు పూర్తిగా చితికిపోలేదు. పైగా పాలకవర్గానికి అండగా నిలబడినవి. జర్మనీ పాలకులు జారిస్టు రష్యా పాలకులంతగా అవినీతిపరులు, అసమర్థులు కాలేదు. ఇంతేకాక విప్లవాన్ని అణచివేయ మిత్రరాజ్యాల సైన్యాలు పశ్చిమ సరిహద్దులో తయారుగా ఉన్నవి. ఇట్టి పరిస్థితులలో సంభవించిన తిరుగుబాటు కొంతమంది సైనికుల తోడ్పాటు పొందగలిగి నప్పటికిని పూర్తిగా అణచివేయబడింది. ఇదే విధంగా ఫిన్‌లాండ్‌లో తిరుగుబాటు జర్మనీ సైన్యాలచేత, హంగరీలో తిరుగుబాటు రుమేనియా సైన్యాలచేత అణచి వేయబడినవి. చివరకు 1923 నాటి జర్మనీ విప్లవం కూడా పరాజయం పొందింది. దేశంలో బలవంతమైన కమ్యూనిస్టు పార్టీ ఉంది, సోవియట్ రష్యా సహాయం ఉంది; వీరైతే దెబ్బతీయడానికి రెడ్ ఆర్మీ సిద్ధంగా ఉంది. అయినప్పటికీ జర్మన్ సైన్యాలు విప్లవాన్ని మొలకెత్తగానే త్రుంచివేయగలిగినవి. అనుభవంనుండి గుణపాఠం నేర్చుకొనటానికి బదులు కమ్యూనిస్టులు తప్పంతా సోషల్ డెమోక్రాట్లపై వేసి ఆత్మ సంతృప్తి చెందారు.

ఇక రెండవ ప్రపంచ యుద్ధానంతరం తూర్పు యూరపు రాజ్యాలలో కమ్యూనిస్టులు అధికారంలోకి రావటానికి ప్రధాన కారణం రష్యా తోడ్పాటే. ఈ దేశాలలో వీరు అధికారం చేజిక్కించుకోగలిగింది రెడ్ ఆర్మీ తుపాకుల అండ

తోను, ప్రత్యర్థులను మోసగించుటద్వారానో గాని సాయుధ విప్లవం ద్వారా మాత్రం కాదు. చెకోస్లావాకియాలో కమ్యూనిస్టుల తిరుగబాటు జయప్రద మవటానికి కారణాలు—బెనిష్, మాజరిక్ లు అంతర్యుద్ధానికి, రక్తపాతానికి వెరచి రష్యా ఒత్తిడికి లొంగిపోవటము, సైన్యమంతా రష్యా అదుపులో ఉండటము. చెకోస్లావాకియా సమస్య రెండవ మ్యూనిక్ అయి, ప్రజాస్వామ్యరాజ్యాల కండ్లు తెరపించి, కమ్యూనిస్టు ఉపద్రవం బోధపడేటట్లు చేయాలని బెనిష్ వాంఛించినట్లు అతని అనుచరులలో ఒకరన్నారు. పై సంఘటనలను బట్టి రెండవ ప్రపంచ యుద్ధానంతరం యూరపులో కేవలం స్వశక్తిపై ఆధారపడి విజయం సాధించిన సాయుధవిప్లవం ఒక్కటి కూడా లేదని విశదమయింది.

అయితే చైనాలో కమ్యూనిస్టుల విజయం సాయుధ విప్లవ వాదులకు—ముఖ్యంగా ఆసియాలో—తిరిగి ఆశను రేకెత్తించింది. కాని చైనా కమ్యూనిస్టుల సాయుధ విప్లవం సఫలమగుటకు కూడా రష్యాలోవలెనే కొన్ని ప్రత్యేక అనుకూల పరిస్థితులు తటస్థపడటమే కారణము. అసలు చైనా విప్లవం నిన్న మొన్నటిది కాదు. ఇప్పటికి యిరవై సంవత్సరాల నుండి జరుగుతున్నది. మొదట కమ్యూనిస్టులు చాంగ్ కై-షేక్ చేతిలో తీవ్రంగా దెబ్బ తిన్నారు. కాని జపాన్ దండయాత్ర అతని చేతులను కట్టివేసింది. ఒకవైపున జపానుతోను, మరోవైపున కమ్యూనిస్టులతోను పోరాడటం అతనికి అసాధ్యమైపోయింది. ఇతర దేశాలలోని అభివృద్ధి నిరోధకులవలెనే చాంగ్ కై-షేక్ కూడా జపానుతో చేతులు కలిపితే కమ్యూనిస్టులను పూర్తిగా అణచివేయ గలిగేవాడు. కాని జపాను చేతిలో కీలుబొమ్మ కావటం అతనికి యిష్టం లేకపోయింది. పైగా జపాను పై యుద్ధంలో కమ్యూనిస్టులకు మిత్రమండలి తోడ్పాటుకూడా లభించింది. మొదటినుండీ రష్యా అండ ఉన్నది. చైనా సరిహద్దు దేశం కావటంవలన రష్యా గుప్తసహాయం చేయటానికి బాగా వీలు కలిగింది. ఈ విధంగా పరిస్థితులన్నీ కలిసిరావటంవలన కమ్యూనిస్టులు తమ ఆక్రమణ క్రింద ఉన్న భూభాగంలో అధికారం సుస్థిరపరచుకోగలిగారు. రెండవ ప్రపంచయుద్ధం పూర్తి అయేసరికి చైనా కమ్యూనిస్టుల పోరాటం సాయుధమైన తిరుగుబాటు దశ దాటి రెండు ప్రభుత్వాల మధ్య, రెండు సుశిక్షిత సైన్యాల మధ్య పోరాటంగా పరిణమించింది. ఈ పోరాటంలో కమ్యూనిస్టులకు రష్యానుండీ, కోమింటాంగ్ పార్టీ వారికి అమెరికానుండి బయటి సహాయం లభించింది. ఐతే చాంగ్ కై-షేక్ అమెరికా సహాయాన్ని సరిగా వినియోగించుకో లేకపోయినాడు. అతనిలోను, అతని అనుచరులలోను, ఉద్యోగులలోను అవినీతి, అసమర్థత, స్వార్థం మితిమీరిపోయినవి. అమెరికా యిచ్చిన ఆయుధ సామగ్రిని చాంగ్ ఉద్యోగులు కమ్యూనిస్టులకు అమ్మివేశారన్న విషయం తెలుసుకుంటే అవినీతి యెంత ప్రబలిపోయిందో బోధపడుతుంది. సైనికుల జీతాలకై అమెరికా యిచ్చిన ధనాన్ని పైవారు తమ జేబులలో వేసుకున్నారు. సైనికులలో అసంతృప్తి ప్రబలి యుద్ధోత్సాహం సన్నగిల్లింది. తండోపతండాలుగా ప్రత్యర్థులతో కలిసిపో నారంభించారు. ఈ విధంగా కోమింటాంగ్ పార్టీ తన వ్రేలితో తన కన్ను పొడుచుకున్నది. ఇట్టిపరిస్థితులలో అమెరికా సైనికంగా జోక్యం కలిగించుకోకపోవటమే కాక చాంగ్ కు ఆర్థిక సహాయం కూడా ఆపివేసింది. అంతటితో కమ్యూనిస్టుల విజయం ఖాయమైపోయింది. ఈ విధమైన ప్రత్యేక పరిస్థితులు తటస్థపడని పర్షియా, బర్మా, ఇండోనీషియా మొదలైన దేశాలలోని కమ్యూనిస్టు తిరుగుబాట్లు నీరు కారిపోయినవి.

పై అనుభవాలను బట్టి 20 వ శతాబ్దంలో సాయుధ విప్లవం యేదో తలవని తలంపుగా అనుకూలపరిస్థితులు కలిసివస్తే తప్ప జయప్రద మవటం అసాధ్యమని తేటతెల్లమౌతుంది. అన్ని దేశాలలోను రష్యా, చైనాలలో వలెనే జరుగుతుందనుకోవటం కేవలం మూఢ విశ్వాసమే. అందులోనూ టాంకులు, విమానాలు, బాంబులు, ఆటంబాంబులు మొదలైన ఆధునిక మారణాయుధాలు సమకూర్చుకొన్న సుశిక్షిత సైన్యాలు గల సుస్థిరమైన ప్రభుత్వాలను సాయుధ విప్లవం

ద్వారా పడగొట్ట ప్రయత్నించటం గొర్రె పోటేలు పర్వతాన్ని ఢీకొన్నట్లవుతుంది. విప్లవకారులు చిన్న చిన్న ఆయుధాలను-తుపాకులు, రివాల్వరులు, చేతి బాంబులు మొదలైనవానిని సంపాదించగలరేకాని టాంకులు, విమానాలు, అటం బాంబులు సమకూర్చుకోలేరు కదా! భారీ యుద్ధ పరికరాలను యితర దేశాల నుండి సంపాదించవచ్చు ననుకొన్నా అవి చాలినన్ని లభించటం అసంభవం; పైగా యీ అవకాశము అందరికీ, అన్ని వేళలా లభించదు. నేటి వరకు సంభవించిన సాయుధ విప్లవాలలో జయప్రదమైన వాని సంఖ్య అత్యల్పం; విఫలమైనవి బహు సంఖ్యాకం. ఫ్రెంచి విప్లవానంతరం నేటి వరకు స్వశక్తితో జయప్రదమైన సాయుధ విప్లవం రష్యావిప్లవం ఒక్కటి మాత్రమే. ఇంక నేడు చైనలో జరుగుతున్న పోరాటాన్ని సాయుధ విప్లవ మనటంకంటే రెండు ప్రభుత్వాలమధ్య యుద్ధ మనటం యెక్కువ సబబుగా ఉంటుంది.

ఇంతేకాక సాయుధ విప్లవాలు తరచు ప్రత్యాఘాతక విప్లవాల విజయానికి అవకాశం కలిగిస్తవి. గత రెండు ప్రపంచ యుద్ధాల మధ్య కాలంలో యూరపులో బయలుదేరిన విప్లవాలన్నీ విఫలం కావటం, ప్రత్యాఘాతక విప్లవాలు సఫలం కావటం, తద్వారా ప్రజాస్వామ్య విధానం చావుదెబ్బ తినటం జరిగింది. విఫల సాయుధ విప్లవాలే ఫాసిజం బలపడి యూరపు నంతటినీ కబళించటానికి బాగా తోడ్పడినవి. కమ్యూనిస్టులు బలవంతంగా తమ నెత్తిపై కమ్యూనిస్టు సిద్ధాంతాలను రుద్దుతారనే భయంతో మధ్యతరగతి ప్రజలు వివేకాన్ని కోల్పోయి ఫాసిస్టుల వలలో పడ్డారు.

సాయుధ విప్లవాలు అసాధ్యమే కాక, అవాంఛనీయం కూడాను. అనుభవాన్ని బట్టి సాయుధ విప్లవాలు ప్రజాస్వామ్యవిధాన స్థాపనకు బదులు నియంతృత్వ స్థాపనకే దారితీస్తవి అని కూడా స్పష్టమయింది. సాయుధమైన తిరుగుబాటు సాధనగా ఉపయోగించిన కమ్యూనిజం కార్మికవర్గ నియంతృత్వానికి దారి తీసింది. సాయుధ విప్లవవాదులు ప్రజలను విజ్ఞానవంతులను చేయటంకంటె వారి ఉద్రేకాలను రెచ్చగొట్టటానికే యెక్కువ ప్రాముఖ్యం యిస్తారు. ఆవేశపరులయిన ప్రజలు నాయకులను గుడ్డిగా అనుసరించి ప్రభుత్వాన్ని బద్దలు కొట్టగలరే కాని తమ హస్తగతమయిన అధికారాన్ని అదుపులో ఉంచుకొని తమ శ్రేయస్సును, స్వేచ్ఛను అనుగుణంగా నిర్వహించజాలరు. విద్యావిహీనతవలన, పరిపాలనజ్ఞానం లోపించటంవలన, నాయకులందు గల మూఢవిశ్వాసంవలన పాలనాధికారాన్ని నాయకుల చేతులలో పెట్టి పాల ముంచినా, నీటముంచినా మీదే భారమంటారు. ఇది అదనుగా తీసుకొని ప్రజానాయకులమని చెప్పుకొనే కొందరు అధికారాన్ని చేజిక్కించుకొని నిరంకుశపాలన ప్రారంభిస్తారు. వీరు తరచు ప్రజలను నీటముంచుతూ ఉంటారు. ఇందువలన సాయుధ విప్లవంద్వారా డెమోక్రసీ సాధించటం పగటికల అయింది.

సాయుధ విప్లవానికి ప్రత్యామ్నాయంగా ప్రజల సమ్మతి ద్వారా శాంతియుతంగా విప్లవం సాధించే మార్గం లేకపోలేదు. ప్రజాస్వామ్య విధానాల ద్వారా ఎన్నికలలో బహు సంఖ్యాకుల సమ్మతిపొంది సామాజిక వ్యవస్థయందు విప్లవకరమైన మార్పులు చేయవచ్చును. మారణాయుధాలతో గాక ప్రజల ఓట్లతో విప్లవాన్ని సాధించవలసి ఉంటుంది. ప్రజల ఉద్రేకాలను రెచ్చగొట్టటానికి మారు వారిని విజ్ఞానవంతులుగా చేయటం అవసరం. ప్రజల విద్యావిహీనతను, అజ్ఞానాన్ని, మూఢవిశ్వాసాలను తొలగిస్తూ వారికి ప్రజాస్వామ్య జీవితవిధానంలో తర్ఫీదు యివ్వ కృషి చేయాలి. ప్రజల బలహీనతలను అవకాశంగా తీసుకొని వారిపై అధికారం చలాయించ ప్రయత్నించక, వారికి తమ్ము తాము పరిపాలించుకోగల సమర్థత కలిగించ పాటుపడాలి. తమ స్వేచ్ఛాసౌఖ్యాల అభివృద్ధికి యేవి అనువైనవో, కావో నిర్ణయించుకోగల విజ్ఞానం ప్రజలకు బోధించిననాడు సాయుధమైన తిరుగుబాటు లేకుండానే సాంఘికాభివృద్ధి సాధించ వచ్చును. అయితే యిది సాయుధ విప్లవమంత ఆకర్షణీయంగా గాని, గమ్యస్థానానికి దగ్గర తోవగా గాని కనపడదు. ఇందుకు యెంతో సహనము, ప్రజలలో విశ్వాసము, మొదతెగని కృషి కావాలి.

ఈ విధానం జయప్రదం కావాలంటే—(1) దేశంలో ప్రజాస్వామ్య సూత్రాలను పాటించే ప్రభుత్వ ముండాలి; (2) ఏదో ఒక ప్రత్యేక వర్గానికి కాక వివిధ వర్గాల ప్రజలకు అంగీకార యోగ్యమైన రాజకీయ సిద్ధాంతం కావాలి; (3) ఈ సిద్ధాంతాలను తమలో జీర్ణించుకొని, ఆచరణలో ప్రతిబింబింప చేయగల నైతిక ప్రమాణముగల వ్యక్తులు తయారుకావాలి. ప్రభుత్వం ప్రజాస్వామ్య సిద్ధాంతాలకు కట్టుబడినప్పుడే ప్రజల వాక్స్వాతంత్ర్యము, పత్రికా స్వాతంత్ర్యము, పార్టీ స్వాతంత్ర్యము, సమావేశ స్వాతంత్ర్యము మొదలైన పౌరస్వత్వాలకు భంగం కలిగించనంతవరకుమాత్రమే పైన తెల్పిన శాంతియుత విప్లవం జయప్రదమయే అవకాశ ముంటుంది. నియంతృత్వ ప్రభుత్వాలున్న దేశాలలో సాయుధమైన తిరుగుబాటు తప్ప గత్యంతరం ముండదు. రెండవది ఏదో ఒక ప్రత్యేక వర్గానికి కాక వివిధ వర్గాలకు—కార్మికులకు, కర్షకులకు, మధ్యతరగతి ప్రజలకు, మేధావులకు—అనుకూలమైన సిద్ధాంతం సృష్టించుకోగలిగి వుండాలి. యూరపులో కమ్యూనిస్టు ఉద్యమాల విఫలతనుండి మనం నేర్చుకోవలసిన గుణపాఠం యిదే. ఇంక మూడవది అతి ప్రధానమైనది. ఉత్తమ సిద్ధాంతాలు ప్రచారం చేసే వ్యక్తులు ఉత్తమమైన నడవడిక కలవారై వుంటేనే కాని ఆ సిద్ధాంతాలు ప్రజలలో వ్యాప్తిచెందనేరవు.

ఈ విధమైన నవ్య విప్లవ మార్గము అనుసరించటం వలన సాయుధ విప్లవం వలన కలిగే అరాజకం, రక్తపాతం, నియంతృత్వ పాలన మొదలైన చెడుఫలితాలు లేకుండా సాంఘికాభివృద్ధి సాధించటం అసాధ్యంకాదు. ఇంతేకాక యీ విధానం సుస్థిరమైన ప్రజాస్వామ్య జీవిత విధానానికి పునాది వేస్తుంది. ప్రజలు విజ్ఞానవంతులై ప్రభుత్వాన్ని తమ అదుపులో ఉంచుకోగలిగిననాడు నియంతృత్వ ప్రమాదం వాటిల్లదు. అప్పుడు మాత్రమే ప్రజల పేరున జరిగే ప్రభుత్వాలు కాక నిజమైన ప్రజాప్రభుత్వాలు స్థాపించబడగలవు.

# సమాజవ్యవస్థలో—ముష్టి

సవ్యసాచి

ముష్టి అన్నశబ్దం విననివారు ఉండరు. కాని దీన్ని వాడ్డంలోనూ, నిర్వచించడంలోనూ చాలా జాగ్రత్త తీసికోవాలి. మా వూరు ఒక దొమ్మరి వచ్చాడు. అతగాణ్ణి ఎవరో ముష్టివా డన్నారుట— ఒక్కసారిగా గుడ్లు పెద్దవిచేసి- 'ఊరికే కాని నన్ను పోషిస్తున్నావా?- ముష్టి అని తెగ అంటున్నావు? సర్కసు కెళ్లి అర్థరూపాయి దర్శించినట్టే, నా మొగ్గలన్నీ చూసి రెండుడబ్బు లేస్తున్నావు. సరిగ్గా మాట్లాడ్డం నేర్చుకో—' అన్నాడు.

అంతా నివ్వెరపోయారు.

'కాలం అలా మారింది'-అన్నాడు మా చప్పిడపళ్ళ పెద్దన్న గారు.

కొంచెం ఇంచుమించుగా-ఎదుటివారికి ఏమీ ప్రతిఫలం చూపకుండా లాభాన్ని గుంజడం అంటే సరిపోతుందేమో!

ముష్టి అన్నశబ్దం రోజూ ఎన్నిసార్లు వింటున్నామో లెక్కపెట్టలేము. చిన్నపిల్లలుకూడా ముష్టివాడు అంటే అతిసులభంగా గ్రహిస్తారు. తమ చిన్ని చేతులతో బియ్యం దానంచెయ్యడం వాళ్ళకి సరదా—

దొరలు వచ్చినతరవాత, ఈ మాట మరీ వ్యాపకానికి వచ్చింది. ఆంగ్లభాషలో దీన్ని బెగ్గింగు- అంటారు. దీనివిలువ బాగా కనిపెట్టి దొరలు దీన్ని మహాదురుసుగా వాడేరు. ఉదాహరణకు— ఎక్కడేనా, అనవసరపు నమ్రత, వినయం చూపించాలంటే బ్రహ్మాస్త్రంలాగ ప్రయోగించారు. ఐ బెగ్ టు రిమెయిన్, ఐ బెగ్ టు స్టేట్, ఐ బెగ్ టు డిఫర్, ఐ బెగ్ టు ఎన్‌క్లోజ్- ఇలాంటివి ఎన్నో!

రోజూ నిత్యవ్యవహారంలో కోట్లు కనపడతాయి.

ఆఖరికి ఇది ప్రతీ నరానికీ, ప్రతీ రక్తకణానికీ ఎక్కిపోయింది. ఇంతవ్యాప్తిపొందిన వ్యాపారానికి శాఖలుండడం అతిసహజం.

౧. పెద్ద తరగతులముష్టి; ౨. నీచతరగతుల ముష్టి అని రెండు ప్రధానశాఖలుగా విభజించడం సమంజసం అనుకుంటా—

పెద్దతరగతులముష్టి- ఈ మధ్యనే వచ్చిందనీ, పూర్వంనుంచీ వుందనీ వాగ్గేయకారులు రెండు విధాలుగా చీలిపోయారు.

మా క్లాసులో పాఠంచెపుతూ- "బెగ్,బారో ఆర్ స్టీల్- అంతేకాని పుస్తకం లేదంటావేమిరా-" అంటూ ఉపనిషద్వాక్యాలు వెళ్ళబోసేవారు, మా మేష్టారు. ఇదే అసలు 'మర్యాద రకం' లేక 'పెద్దరకం' ముష్టికి పునాది అని మా వెంకటేశం అస్తమానం వాదిస్తాడు.

మా పెద్దింటి పేరయ్య శాస్త్రులుగారు - పిలక ఝాడించుకుంటూ- 'మనకి వుంది పూర్వంనుంచీ ఈ అలవాటు; అన్ని గొప్పలూ దొర్లకే అంటు గడతావేం'- అని హుంకరించేవారు.

ఇంకా మాట్లాడితే- నోరుముయ్యి అన్నట్టు- 'ఉడురాజోపల స్ఫుటనాసుభగమై...' అని మొదలెట్టి 'భవ భిక్షాందేహి అను వాక్యానన్'- దాకా గడ గడ చదివేసి, అందులో ఉన్న విశిష్టత, నమ్రత, ఇహం, పరం-అన్నీ ఒక్క గుక్కలో ఏకరవు పెట్టేవారు.

పరంమాట ఏమైనా-ఇహం ఉందికదా అని మా అందరి నోళ్లూ మూసుకుని ఊరుకునేవాళ్లం.

'పూర్వం ఋషులు ఏవూరు కావూరు, ఆ వేళకు భిక్షాటనం చేసుకుని కాలం గడిపేవారుట- ఇలాగే నేమిటి?' అని మా అమ్మమ్మ, విభూతి బొట్టు అద్దంలో దిద్దుకుంటూ అంటూంటే మన ముష్టికి చాలా చరిత్ర ఉందనిపిస్తుంది.

పూర్వం ముష్టికి అగ్రతరగతికే అధికారం ఉండేది. బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులలో చివరి మూడు తెగలకూ ఏదో వృత్తి

తన సిగరెట్టు పరాయివాళ్ళ అగ్గిపెట్టెతో వెలిగించుకోవాలని, తన పేపరు చదివే అలవాటు ఇతరులు కొన్న పేపరుతో తీర్చుకోవాలని అభిలషించే పరాన్న భుక్కులు ఎంతమందో!

ముక్కు పొడుం, సిగరెట్టు, చుట్ట, బీడి, అగ్గిపెట్టె వగైరా-ముష్టిలోకి రావు అని నవయువకుల సంఘం ఈమధ్యే తీర్మానం చేసింది. వీటిని మనం ఇందులో చేర్చడం సాహసమే! అవన్నీ గొప్ప తరగతులకు చెందిన జన్మహక్కట.

ఇంక రెండవరకపు ముష్టికి వద్దాం. ఈ నీచ రకపు ముష్టి, దేశాభ్యుదయాన్ని వెనక్కులాగే శనిగ్రహం లాంటిదని అందరూ ఒప్పుకుంటారు. ఈరకపు పారిశ్రామికుల సంఖ్య దినదిన ప్రవర్ధమానం అవడం అందరూ చూస్తున్నదే.

ఇది చాలామందిని అడ్డుపుల్లలాగ బాధిస్తుంది.

మా నీలాంబరంగాడు ముష్టివాళ్ళను చూసినప్పుడల్లా కళ్లు చింత నిప్పులు చేసి చూస్తాడు.

దానికి కారణం ఒకరోజున అడిగా——

వాడు మోడరన్ కేఫ్ నుంచి, టిప్ టాప్‌గా తయారయి, కాఫీ త్రాగి (పరుల సొమ్ముతో) అనుకోకుండా ఇంకో స్నేహితుడు ఆఫర్ చేసిన సిగరెట్టు పీలుస్తూ వస్తూంటే——ఒక ముష్టిపిల్ల పట్టుకుని వదలందే...ఎన్ని విధాలో చూసీ చూడనట్టూ...ఆ కళ్ళలో కసిరినట్లూ...ఏం చేసినా వదలదాయె!

ఇదంతా ఎదురు మేడమీద ఒక అమ్మాయి చూసి కడుపుబ్బేలాగ నవ్విందట.

'ఇలాంటి సమయాలే కనిపెట్టి వీళ్లు చంపుతారు. వీళ్ళని తుపాకీతో కాలుస్తే పాపముందా?' అంటాడు——

మా డాంబికాచారి ఇంట్లో చాట్టాని కేనా గుప్పెడన్నం పెట్టకపోయినా- కారుల లోనూ, రైళ్ళలోనూ దానం చేస్తూ (ఒక్క అణా లో పేలెండి) మంచి పబ్లిసిటీతో, పలుకుబడి సంపాదించుకుంటాడు.

కాలాంటివాడు వెర్రిగా నూస్తే ఈచర్యలు, "వీళ్లు మనవాళ్లదా పెంచుతాఁరా సమాజంలో-" అంటాడు చిరునవ్వుతో.

ఆఖరికి ఇది ఒక వృత్తి అయిపోయింది. ఒకరోజున మునసబుగారి ముసలి పాలికాపు, పది మందినీ గుడి అరుగుమీద కూర్చుండగా, వచ్చి-

'నేను పాలికాపుతనాన్ని మానుకుంటాను బాబయ్యా' అన్నాడు.

'ఏం? కూలి చేసుకుంటావా?' అన్నా.

'అడుక్కుంటానండి బాబయ్యా-' అన్నాడు చిరునవ్వుతో.

'ఏం?' అని అడగ్గా——

'పాలికాపుతనం చేసినా అర్థాకలి తిండే కదు బాబూ- అది అడుక్కుంటే ఈ ముసలాడు ఏ కష్టం పొందక్కరలేకుండానే దొరుకుతాది బాబయ్యా!' అన్నాడు.

నిజమే! నేడో రేపో అని వున్న ముసలివాడు ఎలా పనిచేస్తాడు? ఎలా ఊరికే ఉంటాడు? అడుక్కోడమే శరణ్యం.

ఒకరోజున రైలులో పోతున్నా. మాది మధ్యతరగతి పెట్టేమో, అన్ని తరగతులవాళ్లూ ఉన్నారు. కొందరు సోషలిస్టు అభిమానులు, కొందరు కమ్యూనిస్టు అనుచరులు, కొందరు ధనికులు, కొందరు ఆవేళకు పెద్ద టిక్కెట్లు కొనుక్కున్న మధ్యతరగతి వాళ్లు. ఒకమూల టిక్కెట్టు లేకుండా ప్రయాణం చేస్తున్న బీదవాడు.

రకరకాల సంభాషణలు సాగుతున్నాయి. ఐక్యరాజ్య సమితి కార్యకలాపం దగ్గరనుంచి పల్లెటూరి పంచాయతీ రాజకీయాలదాకా మాట్లాడుతున్నారు. కిక్కిరిసి ఉన్న మా పెట్టెలోకి- 'బాబా బహు బీదలమూ, అనాథులమూ-' అంటూ ఒక బిచ్చగాడు వచ్చాడు.

ఒక శాలం అంచు కండువా (ఖద్దరే లెండి), పదివేళ్లకీ ఉంగరాలూ, చేతిలో చందమామా ఉన్న పెద్దమనిషి- 'ఎక్కడికిరా వస్తావు ఊరికే? మీద పడిపోతావేమిటి- దిగు, దిగు' అంటూ కొట్టడానికి లేచాడు. అతికాయ మేమో ఒక పట్టాన్ని నుంచో పెట్టడం కష్టమయింది కాని, లేకపోతే ఆ ముష్టివాడు అణగారి పోవలసిందే.

ఇంకో సన్నమనిషి - 'అలా కసురుతారేమిటండీ? ఏదో అడుక్కునే ముండావాడు. ఇష్టం వచ్చినవాడు వేస్తాడు. లేనివాడు లేదు. ఎలాగో అలాగ బ్రతకాలి కదా!' అన్నాడు.

మొదటి పెద్దమనిషి, 'అసలు ఇలాంటి వాళ్ల వల్లే దేశంలో ముష్టివాళ్ల సంఖ్య మూడు రెట్లు పెరిగిం' దన్నట్టు ఆ ఏడుగుకళ్లు పెద్దవిచేసి,

'ఇలా రారా! అక్కడే నిలబడిపోతావేం! ఇక్కడో కర్ణుడున్నాడని తెలియదా!' అన్నాడు.

'ఆ! కర్ణుణ్ణేనయ్యా-సింగరాజు లింగరాజుల మేమీ కాదు! రారా' అంటూ జేబులో డబ్బు తీసి-'నీ లెక్కేమిటి' అన్నట్టు పెద్దమనిషి కేసి ఠీవిగా ఒకచూపు విసిరి, ఆ సన్నమనిషి ఆ ముష్టివాణ్ణి తృప్తిపరిచాడు.

వచ్చిన ముష్టివాణ్ణల్లా - 'ఇక్కడున్న కర్ణుణ్ణి అడగరా' అంటూండడం మొదలెట్టేడు ఆ పెద్ద మనిషి.

'నీకు శాస్తి చేస్తా' అన్నట్టు ప్రతివాడికీ తృణమో, పణమో ముట్టచెప్పుతూ వచ్చాడు సన్న మనిషి.

ఈ యుద్ధం అందరిలోనూ ఉత్సాహాన్ని లేపింది.

ఇంక అందరూ ముష్టివాళ్ల నాశనానికి యథాశక్తి తమ అపూర్వపు సలహాలు ఇచ్చారు.

ఒక సామాన్యుడు-'మనం ఏం చెయ్యగలం! ప్రభుత్వం తీసుకోవాలి తగిన చర్య, వాళ్లబాగు కోసం!' అన్నాడు.

ఆ పక్కనున్న యం. యల్. ఏ. గారు పట్టరాని కోపంతో బిగ్గరగా - 'ప్రభుత్వం ఏం చేస్తుందయ్యా! ఒకపనా, పాడా! ఒకమూల రాజ్యాంగసభ, మరోమూల రేషనింగు, ఇంకో మూల కమ్యూనిస్టులు-ఇదేం కబుర్లు చెప్పడం అనుకున్నావా?'' అని కసిరికొట్టి ప్రభుత్వం మీది భక్తి గౌరవాలు అమాంతంగా నిలబెట్టి ఊరుకున్నాడు. పక్కనున్న కమ్యూనిస్టు సానుభూతిపరుడు నస్తి పట్టేవాడేకాని, తన అజ్ఞాతవాసం బయటపడ్డం శ్రేయస్కరం కాదని-

'విప్లవం రావాలి!' అని పళ్ళు కొరికాడు. సోషలిస్టు, కొంచెం ఖద్దరు వేస్ట్‌కోట్ సర్దుకుంటూ, కొంచెంగొంతుక సరిచేసుకుని-'ఇంతకీ సోషలిస్టు ప్రభుత్వం రావాలండీ!' అన్నాడు.

ఇవన్నీ సమంజసమైన కారణాలే అన్నట్టు పెద్దమనిషిమాత్రం అన్నింటికీ తన చిరునవ్వు, తలవూపూ సహాయం చేస్తూనే ఉన్నాడు.

మూలనున్న ఆంగ్లోఇండియన్, ఉండబట్టలేక-ఇది అంతర్జాతీయ సమితి వ్యవహారాల్లోకి రాదని, తన అంతర్జాతీయ దృక్పథాన్ని వెల్లడి చేశాడు.

పైబర్తుమీదనుంచి ఒక్కగంతుతో హనుమంతుడిలా దూకి రాడికల్ హ్యూమనిస్టు ఆయన- 'ఇప్పటికేనా చూశారా మా రాజకీయ సిద్ధాంతం ఎంత అవసరమో!' అని సిగరెట్టు కాల్చుకుని మళ్ళీ పైకి ఎక్కేడు.

మా అమ్మమ్మకూడా ఊరుకోక-

'ఇంతకీ పూర్వకర్మ ఫలం!' అంది. మా అమ్మమ్మ కూడా చర్చలో పాల్గొనడం, చందమామ పెద్దమనిషికి కొంత ధైర్యం ఇచ్చింది-

'ఏటా ఒకసారి అన్నదానం చేసేవాణ్ణి. రేషనింగు వచ్చాక మానేశా.' అన్నాడు.

మొదటి సంఘర్షణ జరిగినప్పటి నుంచీ కదలకుండా మూల కూర్చున్న ముష్టివాడికి మా అమ్మమ్మ సలహా దగ్గరనుంచి ఆ హేమాహేమీ రాజకీయవేత్తల సలహాలదాకా ఒకలాగే కనపడ్డాయి.

'ఇంతలో మాకు ముక్తి లేదా బాబూ!' అన్నాడు ఆ గుడ్డివాడు.

ఎవరూ వినిపించుకున్నట్టు కనబడలేదు.

'బాబూ! మన కవులందరూ - "ఏ పూర్వ పుణ్యమో, ఏ యోగఫలమో! జనియించి నామిదీ స్వర్గలోకమున" అంటారు' - అని వెర్రినవ్వు నవ్వేడు.

ముష్టివాడి నోటినుంచి పెద్దమాటలు వింటం అందరికీ ఆశ్చర్యం కలిగించింది.

'వీడు ఏకమ్యూనిస్టో!'-అన్నముక్క మన పెద్దమనిషి నాలుక చివరదాకా వచ్చింది. కాని ఇలాంటి ముక్కలు పైకి అంటంవల్ల కాయాన్ని ఇంటికి క్షేమంగా చేర్చడం కష్టమని ఊరుకున్నాడు.

'ఇన్ని పెద్ద కబుర్లు చెప్పేవాడివి-ఈ చావు బ్రతుకు ఎందుకు బ్రతకాలి? అంతకంటె చావకూడదూ?'-అన్నాడు ఊరుకోలేక పెద్ద మనిషి.

'చావలేకే బాబూ! నరకానికి ఎప్పుడో దరఖాస్తు పెట్టుకున్నాం. కాని యమధర్మరాజు- "మీరు నరకంలో సుఖపడిపోతారు. మీరు హిందూదేశంలోనే ఉండాలి!" అని మమ్మల్ని గుమ్మాలదగ్గరకు రానియ్యడం లేదు' అని వెకిలినవ్వు నవ్వేడు.

అందరికీ ఆ ముష్టివాడిమీద కోపం వచ్చింది.



# అప్పగింత

## 6

పన్నెండేళ్లు గడిచాయి. ఆ దీర్ఘ కాలంలో దాసు జీవితంలో చెప్పుకోదగ్గ మార్పులేవీ జరగలేదు. ఒకరోజు తర్వాత యింకోరోజు నెమ్మదిగా, ప్రశాంతంగా వెళ్లిపోయింది. చిన్ననాటి అనుభవాలు, స్మృతిచిహ్నాలుమాత్రం అతనిలో మేలుకొనే వున్నాయి. సంవత్సరాలు నెలలలాగ గడిచాయి.

రామదాసు యిన్నాళ్లూ ఏకాంతవాసం గడిపాడు. అయితే అతను ఏ పనికోసమైతే నియమించబడ్డాడో ఆ పనిమాత్రం మరచిపోలేదు. సరోజ అతని ప్రతి పనిలోను, ప్రతి ఆలోచనలోనూ కూడా ప్రతిబింబిస్తూ వుండేది. అతను పూర్వపు రోజుల్లో అనుభవించే అవమానము, సిగ్గు మొదలైన వాటి స్థానంలో యిప్పుడు సరోజను గూర్చిన వెర్రి ఆవరించుకు కూర్చుంది. దేవతలు నవ్వినట్లు నవ్వే సరోజ చిరునవ్వుముఖం అతని స్మృతిపథంలో గోచరించగానే చేస్తున్న పని మానేసి ఆనందిస్తూ కూర్చునేవాడు. ఎప్పుడూ సరోజ అతనికి చిన్న పిల్లలాగానే కనిపించేది.

ఇటువంటి మధురమైన ఆలోచనలు, ఆనందం, సంతృప్తి రామదాసు హృదయంలోను, ముఖంలోను మంచి మార్పును, దేవత్వాన్ని తెచ్చిపెట్టాయంటే ఆశ్చర్యంలేదు. అతని ఆలోచనలకి అంతరాయం రాగానే అతను అకస్మాత్తుగా దేవలోకంలోంచి భూలోకంలోకి వచ్చినట్టుగా భావించి, ఆ దేవత్వాన్ని తను ఆచరించే ప్రతి పనిలోనూ ప్రవేశపెట్టడానికి ప్రయత్నించేవాడు.

అతను పూర్వపు మందకొడి రామదాసు కాడు. అతని ముఖంలోని అసహ్యం, అనాయకత్వం చాలావరకూ నశించి పెద్ద వ్యవహర్తలాగ కనిపిస్తాడు. అతని చిరునవ్వుతో తన ముఖంలోని వికారం కొంతవరకూ కప్పిపుచ్చ గలుగుతున్నాడు.

కాని, యింకా రామదాసుకు ఆడవాళ్ళంటే భయంపోలేదు. వాళ్ళతో ఏం మాట్లాడాలో తెలియక తడబడేవాడు. ఆడవాళ్ళని చూడగానే అతనిలో పూర్వపు వికారమంతా కనబడేది.

ఎనిమిది సంవత్సరాలపాటు అతను సర్వసంగ్రహ నిఘంటు కార్యాలయంలో పని చేశాడు. ఆ నిరాడంబర కార్యనిర్వహణ, ఆ వూరూ పేరూ లేని చాకిరీ అతనికి నచ్చింది. కార్యాలయంలో ఒక మూల ఎవరికీ తెలియకుండా శాంతంగా, ఏకాంతంగా తను వున్నాననేసంగతి అతనికి ఆనందాన్ని కలుగజేసేది. జీవిత సమర రంగంలోకి తాను పిలవబడేవరకూ వేచివుండటం అతనికి సమంజసంగా తోచింది. అప్పుడప్పుడతను గాలిలో మేడలు కట్టుకొని మురిసిపోతూ వుండేవాడు. సరోజ విద్యాలయం వదిలి బైటకు వస్తే తాను మళ్ళీ కలుసుకోవచ్చునుగదా అని సంబరపడేవాడు.

సరోజగురించి ఆలోచనలే అతన్ని ఉల్లాసపరచేవి. అవే అతని మధురస్మృతులు. మిగతా

కాలంలో అతను యంత్రంలాగ పనిచేసేవాడు. మనస్సు నిర్మలంగా వుండడానికి దేవాన్ని సార్థ స్వత సేవలో ఎక్కువగా వినియోగించేవాడు.

ఆ సర్వసంగ్రహ నిఘంటు నామకార్థ సంపాదకుడు దాసు విసుక్కోకుండా ఎంతపనినైనా నవ్వుతూ ఓర్పుగా చేయటం గ్రహించాడు. కార్యాలయానికి తను తరుచు రాకుండానే సంవత్సరానికి అయిదువేల రూపాయల ఆదాయం ఎలా వచ్చేదో కొన్నాళ్ళపాటు అతనికే బోధపడేది కాదు. గుమాస్తాల మీద ఎప్పుడూ కాపలాగా కూర్చోవటం అతనికి చిరాకనిపించింది. రామదాసు చాలా నమ్మకమైనవాడుగా కనిపించాడతనికి. నెమ్మదిగా దాసుకి కార్యాలయంమీద పెత్తనం, అందరికీ పని అప్పగించి చేయించటం, వ్రాత ప్రతులను సరిదిద్దటం, ప్రత్యేక పరిశోధనలు—యివన్నీ అంటగట్టాడు. రెండువందల రూపాయలు దాసుకు పారేసి తన నెత్తిమీద బెడదనూ, బోలెడు తతంగాన్నీ వదిలించుకుని కలమైనా ముట్టకుండానే గొప్ప కీర్తినీ, కావలసినంత ధనాన్నీ ఆర్జిస్తున్నాడు.

రామదాసు సంతోషంతో యీ చాకిరీ అంతా స్వీకరించాడు. అతని తోటివాళ్లు సంపాదక-గ్రంథకర్త కను చాటవగానే వీలయినంత తక్కువ పని చేసేవారు. పాపం రామదాసే వాళ్లపని కూడా చేసేవాడు. అయితే యీ పనంతా అతని విజ్ఞానాభివృద్ధికి తోడ్పడింది. అతను ఏవి శాస్త్రాలనైతే పఠదీసి సమగ్రంగా పరిశీలించి ఆమూలాగ్రంగా తెలుసుకోవాలనుకున్నాడో, అవన్నీ తెలుసుకునే అవకాశం అతనికి నిఘంటు కార్యాలయంలో లభించింది. ఆ ఎనిమిదేళ్లు అకుంఠిత పరిశోధన వల్లా అతను విజ్ఞానఖనియై ఆ చుట్టుపక్కల విజ్ఞానుల్లో తానూ ఒకడైనాడు. బంటచాకిరీ గుమాస్తాగా చేరిన వాడు పండితుడై పోయాడు.

అతను కార్యాలయం వదిలి తన గదికి వెళ్ళినా నిరంతరం తన పరిశోధనల గురించే ఆలోచించేవాడు.

నరసింహం అనేకసార్లు అతన్ని ఆ పనికి మాలిన చాకిరీకి రాజీనామా పెట్టమని ప్రోత్సహించాడు. నరసింహం తను కొత్తగా ప్రవేశించిన ఉద్యోగంలో దాసు కూడా చేరితే మళ్లీ యిద్దరూ కలిసి పనిచెయ్య వచ్చునని చెప్పాడు.

కాని రామదాసుకి స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, విశ్రాంతి అక్కరలేక పోయాయి. అతనికా బానిస చాకిరీలోనే ఎడతెగని దీక్ష, మనోనిశ్చలత కనిపించాయి.

నరసింహం పూర్వపు మనిషిలాగ లేడు. అతను చాలా శ్రమపడి ఆర్జించి కొంత డబ్బు నిలవ వేసుకుని యిప్పుడు పూర్తిగా చారిత్రిక పరిశోధనలోనే కాలమంతా గడుపుతున్నాడు. చరిత్రకారుల పేర్లలో నరసింహం కూడా ఒక స్థానం సంపాదించాడు. అతను చరిత్ర వాంశాలు కొన్నిటిమీద చేసిన వ్యాఖ్యానం వల్ల విశాలమైన కీర్తి గడించాడు.

కొన్నాళ్లు పోయాక దాసు నరసింహం చెప్పి [illegible] కుతున్నాడు. సర్వసంగ్రహ నిఘంటువు చాలమట్టుకు పూర్తి అయిపోయింది. దాని పూర్తి ప్రచురణకు కావలసిన విషయ సామగ్రంతా సిద్ధంగా వుంది.

ఇద్దరు మిత్రులూ మళ్ళీ ఒకేచోట పనిచేసే అవకాశం లభించింది. వారు పరిచితులైన రోజు నుంచీ ఒకేచోట వుంటున్నారు. ఇద్దరూ కలిసి ఒకే విషయంమీద పరిశోధనలు చేసి అనేక వ్యాసాల్ని ప్రచురించారు. ఆ వ్యాసాలు చాలా చైతన్యాన్ని కలిగించాయి. రామదాసు ఆ వ్యాసాల మూలంగా వచ్చిన ప్రతిఫలాన్ని పంచుకోవటానికి ఒప్పుకున్నాడు గాని, ఆ వ్యాసాల మీద తన పేరు వ్రాయటానికి ఒప్పుకోలేదు. ఈ కాలమంతా అతను వృథాగా వినియోగించినట్లుగానే భావించేవాడు. పరోజ సౌఖ్యం కోసం తను కృషిచేయడమే అత నింక చేయవలసిన పనిగా భావించాడు. అతనికి కీర్తి కాంక్ష లేదు; కాని ఏదో కాలం వెళ్ళబుచ్చటానికి పరిశోధనలు చేసేవాడు.

నరసింహం బాగా కీర్తి సంపాదించి కిల్పాకిలో ఒక యిల్లు ప్రత్యేకంగా తీసుకొని అందులో వుండటానికి వెళ్ళిపోయాడు. దాసు మాత్రం యింతవరకు తాను వుంటున్న గదిలోనే వున్నాడు. ఊరికి ఒక చివరున, పట్టణంలోని అలజడికీ, అల్లరికీ దూరంగా హాయిగా వుంటున్నాడతను. ఆ పగిలిపోయి, శిథిలమైపోయిన

మెట్లమీదనుంచి మెల్లిగా ఎక్కి తన గదిలోకి వెళ్ళి తలుపులు మూసుకొని కూర్చుంటే అతని కెంతో హాయిగా, సమాధిలో వున్నట్టుగా వుండేది. అతను ఒక్కడూ కూర్చొని సరోజ గురించే ఆలోచించేవాడు. అతను ఆ ఆలోచనలో పడి వెర్రిగా కిటికీలోంచి నీలాకాశంవైపూ, చెట్లవైపూ ఎంతోసేపు అలాగ చూస్తూ కూర్చుండి పోయేవాడు.

పన్నెండేళ్ళపాటు అతను ఆ గదిలోనే ఉన్నాడు. ఆగది వదలిపెట్టి వెళ్ళాలంటే అతని కెంతో బాధగానూ, విచారంగానూ వుండేది. తన కాగదిలో తప్ప మరెక్కడా సరోజ గోచరించదేమోనని అనుకునే వాడు.

ఒకొక్కప్పుడు సాయంత్రంపూట నరసింహం దాసుతోకూడా అతని గదికి వచ్చేవాడు. అప్పుడు వారిద్దరూ వారి ప్రథమ పరిచయం నాటి రోజులు జ్ఞాపకానికి తెచ్చుకొని చాలా సేపు మాట్లాడుకునేవారు.

అలాగ వారు కాలాన్ని ఒంటరిగా వెళ్ళబుచ్చేవారు. ఎప్పుడైనా యిద్దరు ముగ్గురు స్నేహితుల్నిమాత్రం కలుస్తూ వుండేవారు. వారిద్దరి మధ్యా గౌరవ, ప్రేమ, స్నేహ ప్రవృత్తులు ప్రబలినాయి. రామదాసు నరసింహాన్ని సోదరుడులాగా చూసుకొనేవాడు. నరసింహం మంచితనాన్ని, గౌరవాన్ని దాసు ఎన్నటికీ మరచిపోలేదు. అతని జీవితంలో అతను యింతవరకూ ప్రేమించినవారిలో నరసింహం మూడోవాడు. అతన్ని మొట్టమొదట్లో కలుసుకోకపోతే తన జీవితం ఎలాగ వుండేదో నని అప్పుడప్పుడు రామదాసు ఆలోచించేవాడు. ఈ ప్రశ్న తట్టినప్పుడు దాసు నరసింహం తనకి చేసిన సహాయం గురించికాదు ఆలోచించేవాడు- మానవ సమాజంలో ప్రతి మానవుడూ ఎవరినో ఒకరిని ప్రేమించి, ప్రేమింపబడి దాని మూలంగా పొందే ఆనందం గురించి ఆలోచించేవాడు. నరసింహాన్ని తన జీవితంలో ప్రవేశపెట్టి తనకెంతో ఆనందాన్ని సౌఖ్యాన్ని చూపెట్టిన భగవంతునికి తన కృతజ్ఞతాపూర్వక వందనాల్ని అర్పించేవాడు.

నరసింహం చాలా ముక్తసరి మనిషి. దాసు మాట్లాడేటంతగా కూడా మాట్లాడేవాడు గాదు. దాసుని తన తమ్ముడిలాగ భావించి ప్రేమించేవాడు. దాసులో ఎంత ప్రేమభావం వుందో, అతనిలో ఎంత స్వార్థత్యాగం వుందో గ్రహించి దాసు ముఖంలో ఆ ఔన్నత్యాన్ని గ్రహించి ఆనందించేవాడు. చాలామంది దాసుకేసిచూసి నవ్వుతూంటే నరసింహం ఆశ్చర్యం చెందేవాడు; అతనిలోని ఔన్నత్యాన్ని లోకులు గ్రహించలేనందుకు చాలా విచారించేవాడు.

రామదాసు హృదయకుహారంలో ఏదో రహస్యవేదన వుందని నరసింహం గ్రహించాడు; కాని అదేమిటో చెప్పమని అతని నెప్పుడూ బలవంతం చెయ్యలేదు. దాసుకి తల్లీ తండ్రీ లేరనీ, ఒక గొప్ప యిల్లాలు అతన్ని పోషించి చదువు చెప్పించిందనీ నరసింహానికి తెలుసు. ఆ మాత్రం చాలు అతనికి. కాని దాసు ఏదో మంచి సంగతి తనకి తెలియకుండా దాస్తున్నాడని నరసింహం గట్టి నమ్మకం.

గడచిన పన్నెండు సంవత్సరాల్లోనూ దాసు ప్రతీనెలా ట్రిప్లికేను వెడుతూ వుండేవాడు. కాని, గేటుదాటి లోపలికి వెళ్ళేవాడు కాదు. గేటుముందు అటూ, యిటూ పచార్లు చేసేవాడు; అప్పుడప్పుడు సరోజగురించి వాకబు చేసేవాడు. ఆ రోజుల్లో తెల్లవారగట్టే లేచి కాలి నడకను రెండుమైళ్ళకు పైగా నడిచేవాడు. అతను ఉత్సాహంతో త్వరత్వరగా నడిచేవాడు. తన ప్రయత్నం కొనసాగించుకొని మళ్ళీ ఎవరికీ తెలియకుండా, చివరికి నరసింహానికైనా తెలియకుండా వచ్చెయ్యాలని అతని ఆత్రుత.

మిషనరీ స్కూలుకు వెళ్ళి గేటుముందు అటూ, యిటూ పచార్లుచేసేవాడు. ఎవరైనా జవానులు కనిపిస్తే అడుగుదామని చాలా ప్రయత్నించేవాడు. ఒకొక్కప్పుడు తన గదికి చాలా నిరుత్సాహంగా, నిరాశతో వెళ్ళిపోయేవాడు. ఒకొక్కప్పుడు ఎంతో దృఢసంకల్పంతో వెళ్ళి గేటుదగ్గర జవానుతో మాట్లాడితే, వాడు చీదరించుకొని కసిరేసేవాడు.

కొన్నాళ్ళకి దాసుకి టక్కరితనం అలవాటయింది. కొన్ని కథలు కల్పించి, తాని తమ్మ సరోజనిగూర్చి కనుక్కొని రమ్మన్నదని చెప్పి, సరోజ క్షేమ సమాచారాలు

తెలుసుకునేవాడు. "ఆమె ఆరోగ్యంగా వుంది: బాధ తగ్గింది, అందంగా వుంది" అని వినగానే తన ఆత్మీయుల క్షేమం విన్నట్టుగానే ఆనందించి, ఆ జవానుని ఎంతో పొగడి యింటికి వచ్చేవాడు. వచ్చేటప్పుడు అతను హృదయం ఎంతో తేలిక పడి, తాగినవాడికి మల్లే గాలిలో తేలుతూ హుషారుగా యింటికి వచ్చేవాడు. తన గదిలోకి వెళ్ళి ఎన్నో గాలిమేడలను సృష్టించుకొనేవాడు. ఒక్కొక్కప్పుడు ఆ ఆనందంలో ఏ హోటల్లోనో భోజనంచేసి ఊరంతా అగమ్మకాకిలా తిరిగి దుమ్ములోనూ, ధూళితోనూ ఏ సాయంత్రానికో గదికి చేరుకునేవాడు.

నరసింహానికి దాసు అప్పుడప్పుడు తిరిగి రావటం బాగా అలవాటైపోయింది. మొదట్లో దాసు అలా తిరిగి వస్తుంటే అతన్ని పరదాకి హాస్యాలాడి కవ్వించేవాడు. కాని దాసు చిరునవ్వు నవ్వి ఏమన్నా మాట్లాడకుండా వూరుకునేవాడు. దాసు ఎవరో అమ్మాయి దగ్గరకు వెళ్ళి వస్తున్నా డనుకొని వూరుకునేవాడు.

ఒకరోజున దాసు బాగా అలిసిపోయేలా, ఊరంతా తిరిగి ఉత్సాహంతో యింటికి వచ్చి "ఆమె యిప్పు డెలా వుంటుందో?" అనుకుంటున్నాడు. నరసింహం తన గదిలో కూర్చున్న సంగతి గ్రహించకుండా దాసు యీ మాటలు పైకి అన్నాడు. తీరా అన్నతర్వాత నరసింహం ముఖంలోకి చూసి సిగ్గు పడ్డాడు. కాని నరసింహం మాత్రం ఏమీ అడగకుండా ఊరుకున్నాడు. ఆనాటినుంచీ దాసు రహస్యాల్లో నరసింహం జోక్యం కలిగించుకుందుకు ఏమీ ప్రయత్నించలేదు. అప్పటినుంచీ దాసు ఎప్పుడైనా బయటికి వెళ్ళినా నరసింహం అతని సంచారాలకి ఎంతో విలువ యిచ్చి ఆదరించాడే కాని, దాసుని చూసి యీర్ష్యచెందలేదు.

అలాగ వాళ్ళిద్దరూ జీవితాన్ని వెళ్ళబుచ్చేవారు. కొన్నాళ్ళు పోయినతర్వాత వాళ్ళు శేషగిరి అనే అతనితో పరిచయం చేసుకున్నారు. శేషగిరికి బాగా డబ్బు సంపాదించాలనే ఎప్పుడూ కుతూహలంగా వుండేది. ఆశ్రయించిన వాణ్ణి పొమ్మనలేక వాళ్ళిద్దరూ శేషగిరిని తమతో ఉంచుకున్నారు. శేషగిరి దొంగచూపులూ, ఆడంబరం వాళ్ళకి నచ్చేవి కావు.

శేషగిరి వనమూలికలు అమ్మేవాడు. భగవంతు డేవన్నా అవకాశం కల్పిస్తాడా! ఎప్పుడు ధవంతు ణ్ణాయిపోతానా అని అతను చూసేవాడు. జీవితంలో తిన్నగా వ్యవహరిస్తే పైకి రావటానికి చాలాకాలం పడుతుందని తరుచుగా అనేవాడు. డాక్టరుగాగాని, ప్లీడరుగాగాని బతకమని చెప్పేటంత పెద్ద సలహా మరొకటి లేదనేవాడు ఎందుకంటే డాక్టరూ, ప్లీడరూ ఏదో జీవితాన్ని యీడ్చటానికి కావలసినంత డబ్బు సంపాదించటానికే ఎంతో శ్రమపడాలంటా డతను. అతనిమట్టుకు జీవితాన్ని సుఖంగా పెట్టడానికి అదనుకోసం వేచి వుండి అకస్మాత్తుగా సొమ్ము చేసుకోవాలనే వాడు. త్వరలో అతను బోలెడంత ధనం ఆర్జిస్తానని శపథం కూడా చేశాడు.

అతను అన్నట్టుగానే శేషగిరి త్వరలో బోలెడంత డబ్బు సంపాదించాడు. లాటరీలు, బ్రాకెట్లు, జూదాలు యిలాంటివాటి గురించే మాట్లాడేవాడు. అతను నిజంగా ఏం చేస్తున్నాడో ఎవరికీ తెలిసేదికాదు. అతను వ్యాపారం చేశాడు, డబ్బు బాగా పెట్టుబడి పెట్టాడు; దేవుడు మేలుచేసి, అదృష్టం బాగుండడం వల్ల చాలా ధనికు డైపోయాడు.

దాసు, నరసింహం అతన్ని గురించి వినరాని మాటలు వినటం వల్ల అతన్ని కలుసుకోకుండా వుంటే బాగుంటుం దనుకొన్నారు. అత నిప్పుడు కిల్‌పాక్‌లో వుంటున్నాడు. అతనికిపురశవాకంలో దాసు గదికి రావటమంటే చాలాచిన్నతనం.

ఎలాగైతేనేం ఒకసారి మాత్రం అతను దాసు గదికి రాత్రివేళ తన సౌభాగ్యాన్నంతా ప్రదర్శించటానికి వచ్చాడు. అతని కోరిక నెరవేరినాక ఎంతో సంతృప్తి పడ్డట్టుగా ముఖం పెట్టాడు. దాసు, నరసింహం అతన్ని బాగా ఆదరించలేకపోయారు. శేషగిరి మళ్ళీ వాళ్ళ దగ్గరకు వెళ్ళలేదు.

దాసు, నరసింహం ఒకరి నొకరు ప్రేమించుకొని వాళ్ళ విజ్ఞానంతో, వాళ్ళ సమావాసంతోనే సంతృప్తి చెందేవారు. వాళ్ళు ఒకరిని విడిచి ఒకరు వుండాలని, వుండవలసి వస్తుందనీ ఎప్పుడూ అనుకోలేదు.

(ఇంకా వుంది)




# సూర్య గోళం

రావిపూడి వెంకటాద్రి

అనంతప్రదేశ మహాసముద్రంలో వున్న అనంత కోటి నక్షత్రాల్లో సూర్యుడొక నక్షత్రం. స్వభావంలో నక్షత్రాలకీ, సూర్యగోళానికీ తేడా లేదు. నక్షత్రాలన్నీ సూర్యగోళం మాదిరిగానే స్వయంప్రకాశాలు. అందువల్లనే ఆకాశంలో వున్న నక్షత్రాలన్నీ మనకు మిణుకుమిణుకు మంటూ కన్పిస్తవి. అలా మిణుకు మనకుండా నక్షత్రాలమాదిరే కన్పించేవి వున్నయి కొన్ని. అవి నక్షత్రాలు కావన్నమాట. గ్రహాలో, వుప గ్రహాలో అయివుంటవి. గ్రహాలూ, వుపగ్రహాలూ స్వయంప్రకాశం లేనివి కాబట్టి మిణుకు మనవు. వీటిసంఖ్య చాలా స్వల్పం: ముఖ్యంగా మనకు కన్పించే గ్రహాలన్నీ మన సూర్యుడి సంతానమే. మన భూమి తోబుట్టువులే.

సూర్యగోళ మొక నక్షత్రమే. కానీ మిగతా నక్షత్రాలకంటే పెద్దదిగా కన్పిస్తుంది. మిగతా నక్షత్రాలతో పోల్చుకొంటే నిజంగా దీని కంత పెద్దరికం లేదు. చాలా నక్షత్రాలకంటే చిన్నదీ, వేడి తక్కువదీకూడా. ఐనా మనకూ సూర్య గోళానికీ వున్న దూరంకంటే, మనకూ యితర నక్షత్రాలకూ వున్న దూరం కొన్నిలక్షల రెట్లధికం కాబట్టి అది అంత పెద్దదిగానూ, నక్షత్రాలంత చిన్నవిగానూ కన్పిస్తున్నవి.

సూర్యగోళం మనకి తొమ్మిదికోట్ల మూడు లక్షల మైళ్ళదూరంలో వుంది. దీన్నే కచ్చితంగా చెప్పుకోవాలంటే మనమే సూర్యుడికి ప్రతి జూలై మాసంలోనూ, 94,556,000 మైళ్ళ దూరంలోనూ ప్రతి జనవరిలో 91,444,000 మైళ్ళ దూరంలోనూ వుంటాం. భూమి సూర్యగోళం చుట్టూ సమవృత్త కక్ష్యలో కాక దీర్ఘవృత్త కక్ష్యలో తిరుగుతుంది కాబట్టి దానికి మనంవుండే దూరంలో యీ వైవిధ్యం కన్పిస్తున్నది. అందువల్ల కలిగే ఫలితాల్ని తర్వాత మనం వివరంగా విచారించుకొందాం.

సూర్యుడు వినా అన్ని నక్షత్రాల్లోనూ మనకు దగ్గరగావున్నది ప్రాక్సిమా సెంటారి. దీని దూరం సూర్యుడికీ మనకూ వున్న దూరానికి 2 లక్షల 70 వేల రెట్లు. పరిమాణంలో సమానంగా వున్నా సూర్యగోళాన్ని యింత పెద్దదిగానూ, నక్షత్రాల్ని యింత చిన్నవిగానూ మనం చూడటానికి యీ దూరాల్లోని విభేదమే కారణం.

మనకు అతి సన్నిహితంగా ప్రాక్సిమా సెంటారి $25 \times 10^{12}$ మైళ్ళ దూరంలో వుంది. (25 తర్వాత 12 సున్నలు పెట్టుకొంటే యీ సంఖ్య సరిపోతుంది. ఇలాగే యెంత సంఖ్య

అయినా, 10 కి పైనవున్న సంఖ్యలో సున్నలు పెట్టుకోవాలి. అప్పుడు అంకెల భారం తగ్గుతుంది.) ఇక దూరంగా వున్న నక్షత్రాలు యెంత దూరంలో వున్నవో చెప్పుకోవడం కష్టతరం. ఈ అనంత విశ్వంలో యెటు యెంతదూరం ప్రయాణంచేసినా నక్షత్రాలు కన్పిస్తూనే వుంటవి. అవి కన్పించకుండా వుండే దూరాన్ని మనం వూహించడం అసలే అసంభవం. ఇంత దూరానికి వెలుపలవున్నా యనగలం కానీ, ఇంతదూరానికి లోపల వున్నా యనలేం. అందు వల్ల మన కెంతో విపరీతమైన దూరంలో వున్న నక్షత్రాల స్వభావాల్ని గురించి తెలుసుకోవా లంటే మన కన్నిటికంటే దగ్గరవున్న నక్షత్రాన్ని గురించి - అంటే సూర్యుణ్ణి గురించి - తెలుసుకొంటే చాలు. నక్షత్రాలన్నీ స్వభావంలో తేడా లేనివే కాబట్టి, సూర్యుడు కూడా ఒక నక్షత్రమే కాబట్టి, నక్షత్రాల స్వభావం కూడా చాలా వరకు సూర్యుడి వల్ల అర్థమవుతుంది.

భూగోళమే మన దృష్టిలో చాలా విస్తారమైంది. కానీ భూవ్యాసం 8000 మైళ్ళే. అంటే భూమిమీద మనం 8000 మైళ్ళ లోతున బావి త్రవ్వితే, యిక ఆ క్రింద నీరుండదు. భూమి వుండదు. మరేమీ వుండదు. ఒక చిన్న పూసకు బెజ్జం వేస్తే ఆ బెజ్జానికి వెలుపల ఏం వుంటుంది? ప్రదేశం. వట్టి ప్రదేశం. అంతే-మనం 8000 మైళ్ళు లోతుకు వెళ్ళి చూస్తే భూమి క్రింద వుండేది. న్యాయంగా అది 'క్రింద' కాదు. అక్కడకు వెళ్ళితే అదీ 'పైన' అవుతుంది, మనం క్రింద అవుతాము. అనంతప్రదేశ మహాసముద్రంలో ఒక క్షుద్రమైన పదార్థగోళంగా భూమి వ్రేలాడుతున్నది. అంచేత దీని వుపరితలమంతా పైన క్రిందలే.

ఈ మన భూమితో పోల్చుకొంటే సూర్యగోళం చాలా పెద్దది. సూర్యుడి వ్యాసం 864,000 మైళ్లు. అంటే భూవ్యాసానికి 109 రెట్లు. సూర్యుడి వ్యాసం మీద వరసగా పెట్టుకొంటూ వెళితే 109 భూములు పడతయి. భూమిని తీసుకవెళ్ళి సూర్యుడి కేంద్రంలో వుంచితే భూమి నుంచి 224,000 మైళ్ల దూరంలో వున్న చంద్రుడు సూర్యుడికి చాలా లోపలి భాగంలోనే వుంటాడు.

భూసూర్యుల వ్యాసాలకీ, దూరాలకీ, పదార్థాలకీ ఒక విచిత్రమైన సంబంధం వుంది. భూవ్యాసానికి సూర్యుడి వ్యాసం 109 రెట్లు. దీనికి సూర్యుడిదూరం $109 \times 109$ రెట్లు. సూర్యుడి పదార్థంభూపదార్థానికి $109 \times 109 \times 109$ రెట్లు. పరిణామాన్ని బట్టి సూర్యుడిలో 13 లక్షల భూముల్ని యిమడ్చవచ్చు. కాబట్టి సూర్యుడిలో పదార్థం చాలా విస్తారంగా వుండాలి. గణిత శాస్త్రజ్ఞులు మన కిస్తున్న లెక్కల్ని బట్టి భూపదార్థం కంటే సూర్యుడి పదార్థం 332000 రెట్లెక్కువ. అంటే డేకార్ట్ లాంటి సాహసుడికి కంట్రాక్టు కిచ్చి సూర్యగోళం నిర్మాణం చేయమంటే అందుకోసం మనం తరుగులు కట్టుకోకుండా 332000 భూముల పదార్థాన్ని కూడా యివ్వవలసి వస్తుంది. ఆకర్షణ శక్తిని బట్టి భూమి బరువు లెక్కకడితే $6 \times 10^{21}$ టన్నులని తేలింది. అదే విధంగా సూర్యుడి బరువు కూడా లెక్క కడితే $2 \times 10^{27}$ టన్నులని తేలింది. అంటే సూర్యుడి పదార్థం వలెనే బరువు కూడా భూమికి 332000 రెట్లు.

ఐతే అన్నిటిలోనూ భూమి కంటే అధికంగా వున్న సూర్యుడు గట్టితనంలో మాత్రం చాలా తక్కువ. సూర్యుడి సరాసరి సాంద్రత 1.41. ఇది భూమి సాంద్రతలో నాల్గో వంతు. సాంద్రత యింత తక్కువగావుండటానికి కారణం సూర్యుడు వాయురూపంలో వుండటమే. అందువల్లనే 13 లక్షల భూముల పరిమాణాన్ని ఆక్రమించుకొన్న సూర్యుణ్ణి తయారు చేయడానికి 332000 భూముల పదార్థమే సరిపోతుంది.

ఇక సూర్యుడి గురుత్వశక్తిని గురించి తెలుసుకొందాం. గురుత్వ మంటే పెద్దరికం. పెద్దరికం చూపించే ప్రభావమే గురుత్వ శక్తి. విశ్వంలో ప్రతివస్తువుకీ గురుత్వశక్తివుంది. కానీ ఆశక్తి దాని పెద్దరికం మీద ఆధారపడి వుంటుంది. భూమి కంటే సూర్యుడి గురుత్వశక్తి 28 రెట్లెక్కువ. కాబట్టి మనం భూమిమీద 28 పౌనులరాతిని యెత్తగల్గితే సూర్యుడిమీద ఒక్కపౌను రాయిని మాత్రమే లేవనెత్త గల్గుతాం. ఇక్కడ మనకు మామూలుగా వున్న కండరబలంతో సూర్యుడి మీద అటూ యిటూ కదలడమే కష్టం. ఇక్కడ 56 అంగుళాల గోడ దూకగల్గినవాడు అంత

బలంతో సూర్యుడిమీద రెండంగుళాల గోడను మాత్రమే దూకగల్గుతాడు. అంటే యిక్కడ 56 అంగుళాలు యెగరగల్గిన సత్తావుంటే అది సూర్యుడిమీద అడుగుతీసి అడుగుపెట్టటానికి సరిపోతుంది. భూమిమీద నూరు పౌనులు తూగే మనిషి సూర్యుడిపైన 2800 పౌనులు తూగుతాడు. కానీ యిక్కడి తూనికరాళ్ళనే తీసుకవెళ్ళి వాటితో తూస్తే ఆ మనిషి మళ్లీ ఆ నూరు పౌనులే వుంటాడు. ఎందువల్లనంటే మనిషిమీద సూర్యుడి గురుత్వ ప్రభావం యెంతవుందో బరువులమీదకూడా అంతే వుంటుంది. స్ప్రింగు కాటాతో తూచినప్పుడు గురుత్వంవల్ల వచ్చే తేడా మనకు కన్పిస్తుంది.

ఇక కాంతిమాటకువస్తే సూర్యుడి వుపరితలం మీద ప్రతిచదరపు అంగుళమూ శక్తివంతమైన 250 విద్యుద్దీపాలకాంతి యిస్తుంది. సూర్యగోళమంతా $6 \times 10^{39}$ క్యాండిల్ కాంతి యిస్తుంది. చంద్రబింబం యిచ్చే కాంతికంటే సూర్యబింబంకాంతి ఆరులక్షల రెట్లధికం. నక్షత్రాలన్నీ మన కిస్తున్న కాంతికి 50 రెట్లు అదనంగా చంద్రగోళం మన కిస్తున్నది.

స్వతస్సిద్ధంగా యింతకాంతిగల సూర్యుడి వేడిమికూడా బ్రహ్మాండంగానే వుంటుంది. 9 కోట్ల 30 లక్షల మైళ్ళదూరంలోవున్న సూర్యుడి నుంచి మనకు వస్తున్న వుష్ణప్రసారాన్ని గట్టి మంచుగడ్డతో కూడుకొన్న 16 చ. మై. వృత్తం మీద ప్రసరింపజేస్తే ఆ మంచుగడ్డ ఒక్క సెకండులోనే కరిగిపోతుంది. మరి 8 సెకండ్లలో ఆవిరైపోతుంది. దీన్నిబట్టి సూర్యుడిలోని వుష్ణమెంత తీక్ష్ణంగా వుంటుందో మన కర్థమవుతుంది. సూర్యుడి వుపరితల వుష్ణోగ్రత ఆరువేల డిగ్రీ లుంటుంది. సూర్యుడిమీది వుష్ణోగ్రతలన్నిటిలోనూ యిది తక్కువది. 327° వేడికి సీసమూ, 960° వేడికి వెండీ, 1500° వేడికి యినుమూ కరిగిపోతయి. కాబట్టి సూర్యుడి ఛాయాతలంవేడి ఆరువేల డిగ్రీలంటే అది యెంతో మనకు విశదమవుతుంది. ఛాయాతలంనించి 20 మైళ్లు లోపలికి వెళ్ళితే పదివేల డిగ్రీల వుష్ణోగ్రతవుంటుంది. కేంద్రంలోని వుష్ణోగ్రతకి పోల్చుకొంటే యిదీ క్షుద్రమే. సూర్యుడి కేంద్రంలో రెండుకోట్ల నుంచి నాల్గుకోట్ల డిగ్రీలదాకా వుష్ణాధిక్యం వున్నట్లు లెక్కలుతేలాయి. ఈ వేడికి చుట్టుపట్ల వందలాదిమైళ్ళలోవున్న యే పదార్థంకానీ భస్మీభూతమవుతుంది. ఈ వుష్ణప్రసారాన్నే ఆ పరిభాషలో చెప్పుకోవాలంటే ఒక నిమిషానికి ఒక చదరపు మీటరు ప్రదేశంలో పది లక్షల క్యాలరీలనాలి.

సూర్యుడి వేడినిగురించి విచారించేటప్పుడు మనం ప్రొఫెసర్ సి. జి. అబట్‌ను ప్రమాణంగా తీసుకోవాలి. సూర్యుడివేడినిగురించి ముఖ్యంగా చాలా సంవత్సరాలుగా ప్రత్యేకమయిన కృషి చేశా డతను. భూగోళంమీద వివిధప్రాంతాల్లో వివిధఋతువుల్లో మన వాతావరణంలో లీనమైపోయే వేడినిగురించి ప్రయోగాలు చేశాడు. చివరకు ఒక చదరపు సెంటీమీటరు వుపరితలం మీద 90° సమకోణంలో పడే ప్రసారశక్తి కిరణాలు—అంటే మధ్యాహ్న సూర్యకిరణాలు నిమిషానికి 1.95 క్యాలరీల వేడిని కల్గిస్తవని అతను పర్యవసానంగా తేల్చాడు. అంటే ఒక సెంటీమీటరు మందం కల్గిన నీళ్ళమీద ఆకిరణం నిలువుగా పడేట్లయితే నిమిషానికి 1.95°c తాపక్రమం పెరుగుతుంది. ఇదే కొంచెం తేలికగా చెప్పాలంటే సూర్యుడి పరిమాణంగల గోళంచుట్టూ 426 అడుగుల మందాన మంచుగడ్డ వుందనుకోండి. అది సూర్యుడికి భూమి వున్నంత దూరంలో వుంటే సూర్యుడొక్క సంవత్సరంలోనే దాన్ని కరిగించివేస్తాడు. అలా కరిగించాలంటే $4 \times 10^{23}$ టన్నుల రాకాసి బొగ్గు కావాలి. అంటే భూమికి 70 రెట్ల పదార్థం కావాలన్నమాట. సూర్యుడి నుంచి యింత వేడి మనకు లభ్యం కావాలంటే సూర్యుడి చుట్టూ 16 అడుగుల మందంతో గట్టిబొగ్గు కాలుతూ వుండాలి. అలా మంచి రాకాసిబొగ్గుతో చేయబడివుంటే, సదా యీ వేడి ప్రకారం కాలుతూ వుంటే, లార్డ్ కెల్విన్ లెక్కప్రకారం ఆరువేల యేండ్లలో సూర్యగోళమంతా కాలిపోతుంది. కాని సూర్యుడు బొగ్గుగోళం కాదు. ఆ వేడిబొగ్గు కాలిన ఫలితం కూడా కాదు. కాబట్టి సూర్యుడీ క్రమాన్నే కోట్లకొలది యేండ్లు సాగిస్తూనే వుంటాడు.

అనేక విధాలుగా గణించి సూర్యుడి వుపరితల వుష్ణోగ్రత 6200°—7000° మధ్య

వుంటుందని నిర్ణయించాడు అబట్ మహాశయుడు. ఇంకటి వుష్ణోగ్రతలో యే పదార్థంగానీ దాని స్వరూపంలో వుండలేదనీ, వాయురూపం పొందుతుందనీ తేలుతుంది. పరమాణువులుకూడా వాటి రూపంలో వుండలేవు. సర్ రాబర్ట్ బాల్, జానసన్ స్టోనీలు కర్బనం దాని రూపంలో వుండగల్గుతుందేమో నన్న సంశయాన్ని వెల్లడించారు. కానీ కర్బనంకూడా ఆరువేల డిగ్రీలకే ఆవిరైపోతుంది.

బుతువుల్ని బట్టి సూర్యుడి వుష్ణ ప్రసారంలో నూటికి పదివంతులు తేడావున్నట్లుగా అబట్ మహాశయుడు చూశాడు. అతను చేసిన నిర్ణయాల్లో రెండు ముఖ్యం: 1. మచ్చలు అధికంగా వున్నప్పుడు సూర్యుడి వుష్ణ ప్రసారం అధికం. 2. సూర్యుడిలో నీలత్వం అధికమైనప్పుడు వుష్ణ ప్రసారం అధికం.

సూర్యుడింత వేడిగా వున్నప్పటికీ ఇందులో భూమికి చెందుతున్న వేడిమాత్రం అతి స్వల్పం. ఉదాహరణకు: సూర్యుడి వేడి 200 కోట్ల క్యాలరీ లనుకొంటే అందులో మనకు చెందేది ఒక్క క్యాలరీమాత్రమే. అంటే భూమి మొత్తం మీద నిత్యమూ అవుతున్న వుష్ణ ప్రసారంకంటే 200 కోట్ల రెట్లు సూర్యుడు చేస్తున్నాడన్న మాట. కాబట్టి అధికవుష్ణం ప్రదేశంలోకి పోతున్నది. సూర్యుడినుంచి భూమికి చేరుతున్న యీ వేడిలో పదోభాగం తగ్గితే చాలు. భూభాగం మీది నీరంతా గడ్డ కట్టిపోతుంది.

సూర్యుడి మొత్తం వుష్ణ ప్రసారం నిమిషానికి $5.4 \times 10^{27}$ క్యాలరీ లుంటుంది. ప్రసారాన్ని పొందే ప్రదేశం మొత్తం $6.08 \times 10^{20}$ చ. సెం.మీ. కాబట్టి సూర్యుడి వుపరితలంమీద ప్రతి సెంటీమీటరు చదరమూ 90000 క్యాలరీలు ప్రసారం చేస్తుంది. దీని ద్వారానే మనం సూర్యుడి వుపరితల వుష్ణోగ్రత కనుక్కోగల్గుతున్నాం.

కానీ సూర్యుడి కింత వేడి యెలా వస్తున్నది? అనే ప్రశ్న శాస్త్రజ్ఞుల్లో చాలా రోజులు కలవరం లేపింది. 1849 లో రాబర్ట్ మేయర్ అనే శాస్త్రజ్ఞుడు సూర్యుడినుంచి వచ్చే యీ వేడి అంతా వుల్కలవల్ల లభిస్తుం దన్నాడు. తుపాకి గుండు గమనాన్ని హఠాత్తుగా ఆపినప్పుడు అది మంటగా మారినట్లుగా ప్రదేశంలో విపరీతమైన వేగాలతో ప్రయాణంచేస్తున్న వుల్కలూ, వుల్కలలాంటి యితర పదార్థాలూ భూమివైపువచ్చే కొద్దీ వేగంహెచ్చి భూవాతావరణంలోవున్న గాలిచేత నిరోధించబడి వేడెక్కి మండిపోతయి. ఇదే విధంగా సూర్యుడి వాతావరణంలో నిత్యమూ వుల్కలు రాలుతున్నవనీ, అందువల్ల జనించేవుష్ణం సూర్యుడికి లభిస్తుందనీ, ఆ వుష్ణమే తిరిగి మనకు ప్రసరించబడుతున్నదనీ మేయర్ అభిప్రాయపడ్డాడు. ఈ అభిప్రాయాన్ని బట్టి మనం లెక్కవేస్తే యిక మూడుకోట్ల సంవత్సరాలకు యీ వుల్కాపాతంవల్ల సూర్యుడి బరువు యిప్పటికి రెట్టింపు అవుతుంది. కానీ సూర్యుడి బరువు పెరగటంలేదు. ఒకవేళ పెరుగుతుందను కొన్నప్పటికీ మేయర్ అభిప్రాయపడ్డ రీతిని పెరగటం అసంభవం. అందువల్ల మేయర్ వూహాలు సరైనవికావని స్పష్టపడుతున్నది.

తర్వాత 1883 లో హెంహోట్ అనే జర్మన్ శాస్త్రజ్ఞుడొక సిద్ధాంతం బయటపెట్టాడు. సూర్యుడు క్రమక్రమంగా సంకోచం చెందడం వల్లనే వేడి వుత్పన్నమవుతోందన్నాడు. అంటే సూర్యుడు కోల్పోతున్న శక్తి వేడిరూపేణా మనకు వస్తున్నదని దీని తాత్పర్యం. ఈ సిద్ధాంతం మొదట చాలామందికి సబబుగానే తోచింది. అనేకులు దీన్ని బలపరిచారుకూడా. సూర్యుడు మన కిస్తున్న వేడినిబట్టి అతను లెక్కలుకట్టి సంవత్సరానికి 250 అంగుళాలప్రకారం సూర్యగోళం తగ్గుతున్నదనీ, యిలా తగ్గితే 21 సంవత్సరాల్లో చుట్టూ ఒకమైలు తగ్గుతుందనీ తేల్చాడు. కానీ యీ రకంగా మైలు తగ్గితే సూర్యుడిచుట్టూ వున్న వాతావరణంకూడా మైలు కుంగుతుంది. ఇలా కుంగినపుడు శక్తి వుత్పన్నమవుతుందనీ, ఆ శక్తి పైనసూచించిన మేయర్ వాదంలోని వుల్కాపాతంవల్లవచ్చే శక్తితో సమానమనీ హెంహోట్ వాదం. మేయర్ వుల్కలకి కారణాన్ని అంటగట్టితే హెంహోట్ సూర్యుడికే అంటగట్టాడు. తర్వాత వచ్చిన శాస్త్రజ్ఞులు యితను చెప్పిందీ తప్పేనని రుజువుచేశారు. హెంహోట్ లెక్కప్రకారం లక్షసంవత్సరాలకు భూమిమీది వుష్ణోగ్రత [illegible]° తగ్గుతుంది. కానీ యింకా యితర లెక్కలప్రకారం చూస్తే సూర్యుడి

లోనిపదార్థం విస్తారంగా వుంది కాబట్టి పదిలక్షల సంవత్సరాల తర్వాతకూడా సూర్యుడి వుష్ణో గ్రతలో క్షీణత గమనించతగినంతగా వుండదు. 1862 లో లార్డ్ కెల్విన్ సూర్యుడి ప్రస్తుత పరిమాణాన్ని బట్టి లెక్కలుగట్టి గత ఐదుకోట్ల సంవత్సరాలనించీ సూర్యుడీ రకంగానే కాంతి విక్షేర్ణం చేస్తున్నాడని చెప్పాడు. భూగర్భశాస్త్ర వేత్తల లెక్కల్లో యిదే 300 కోట్ల సంవత్స రాలదాకా పోయింది.

శక్తిప్రసారం జరిగేటప్పుడుసూర్యగోళం నిమి షానికి 24 కోట్ల టన్నుల పదార్థాన్ని కోల్పో తున్నది. ఇంత అధికంగా పదార్థాన్ని కోల్పో తున్నప్పటికీ యిక వందసంవత్సరాలకు సూర్యుడు తన పదార్థంలో 100, 000, 000,000 వ వంతుమాత్రమే నష్టపడుతున్నాడు. అంటే సూర్యుడిపదార్థం $2 \times 10^{27}$ టన్నులలో నూరు సంవత్సరాలకు $1.26 \times 10^{16}$ టన్నులు కోల్పోతుంది. అందు చేత సూర్యుడింతలో చల్లారి మనకు ఉష్ణప్రసారం చెయ్యడనే భయంలేదు.

అస లొక వస్తువు యెంత పదార్థాన్ని శక్తి రూపేణా, కాంతి రూపేణా, వేడి రూపేణా ప్రసరింప చేయగల్గు తుందో అంతగా యితర వస్తువులనుంచి శక్తి ప్రసారాన్ని శోషించుకోగల్గుతుంది. కాబట్టి సూర్యగోళం కొంతపదార్థాన్ని కోల్పోయి నప్పటికీ యిముడ్చుకొనే శక్తివల్ల మళ్ళీ కొంత పదార్థాన్ని పొందుతుంది.

కాకపోయినా నిమిషానికి 24 కోట్ల టన్నుల ప్రకారం రోజుకు 34560 కోట్ల టన్నులు, సంవత్సరానికి 12614400 కోట్ల టన్నులు కోల్పోతుంది. ఇటువంటి 12614400 కోట్ల టన్నులెన్ని అయితే సూర్యగోళం తెరుగుపోయేట్లు? సంవ త్సరానికి 126.4400 కోట్ల టన్నుల పద్ధతిని తగ్గినా 16 లక్షల కోట్ల సంవత్సరాల దాకా సూర్యుడీ విధంగానే ప్రతి నిమిషమూ 24 కోట్ల టన్నుల ప్రకారం శక్తి ప్రసారం చేస్తూ వుం టాడు. అప్పుడు అంతమై పోతాడు. అలా అనుకొన్నప్పటికీ పరిమాణంలో నిత్యమూ క్షీణత చూపించే సూర్యుడు అదేక్రమాన నిత్యమూ శక్తి ప్రసారం చేయలేడు. పోగా కొంత శక్తి ప్రసారం జరిగిన తర్వాత అసలు శక్తి ప్రసారం చేయనేలేదా అనేఅంత తక్కువగా కన్పిస్తుంది. అందువల్ల సూర్యుడు అసలే నాశనం కాడు. ఇంతకుముందు మనం చూసినట్లుగా యే వస్తు వైనా ఉష్ణం, కాంతీ, లేక మరే ప్రసారం రూపేణా గానీ కోల్పోయే శక్తిని అలాగే పరి సరాల నుంచి తెచ్చుకో గల్గుతుంది. వస్తు స్వభా వాన్ని బట్టి శక్తి ప్రసారాన్ని యిముడ్చుకోవ డంలో గానీ, వదలటంలో గానీ తేడా వుంటుంది. సహజంగా ప్రతిబింబించే స్వభావం గల వస్తువు లన్నీ చాలా తక్కువగా యిముడ్చుకొంటవి. వాటి శక్తి ప్రసారం కూడా తక్కువే.

ఉష్ణాధిక్యం కొలదీ శక్తి ప్రసారాధిక్యం వుంటుంది. ఉష్ణం అధికమైనకొలదీ దీర్ఘతరం గాలు హ్రస్వమవుతాయి. ఎరుపు వేడి తెలుపుగా మారుతుంది. అంటే శక్తిప్రసారం దాని తరంగ దైర్ఘ్యం మీద కూడా ఆధారపడి వుంటుందన్న మాట. ఈ వుష్ణాధిక్యం వల్లనే సూర్యుడి వర్ణ పటం పసుపూ- ఆకుపచ్చగా వుంటుంది. అరంగే సూర్యుడి వేడి 6000° అనడానికి తార్కాణం.

మనకు చేరే వేడిలో కొంత వాతావరణమే మింగివేస్తుంది. వాతావరణంలో వున్న నెమ్మూ, ప్రాణవాయువూ కొంత ప్రసారాన్ని భూమికి చేరకుండానే చప్పరిస్తున్నయి. ఆ రూపేణా బహుశా సూర్యుడి కాంతిని కొంత అదనంచేసి మనకు కొంత వుపకారం చేస్తున్నవేమో కూడా. పోగా చెట్లూ చేమా కొంత వుష్ణప్రసారాన్ని తీసుకొంటున్నయి. గతంలో అలా సూర్యుడి నుంచి వృక్షజాతి తీసుకొన్న వేడి కారణంగానే నేడు మనకి బొగ్గు అడవులు దొరుకుతున్నయి భూమిలో. కొందరు శాస్త్రజ్ఞులు మరొక అభి ప్రాయాన్ని కూడా కల్గివున్నారు. ఒక విధ మైన నెమ్ము జీవరాసులు సూర్యరశ్మిని తీసుకొని నేటికి భూమిలో పెట్రోలియం గనులుగా మారాయని అంటారు. మన వాతావరణం లోని వాయుప్రసారానికి సూర్యుడి వుష్ణప్రసా రమే కారణమంటే చాలా మంది తేలికగా గ్రహించ గల్గుతారు. సూర్యుడి వుష్ణప్రసారం [illegible] ప్రయోజనాన్ని తెలుసుకోలేక [illegible] యినప్పటికీ, ఆ ప్రసారాన్ని అదనప్పు [illegible] విశదంగా వుపయో

గించుకోవడంయినా మానవుడికి చేతగాక పోయినప్పటికీ, భూమిమీద నీటిని ఆవిరి రూపేణా యెప్పటికప్పుడు పైకి తీసుకువెళ్లి వర్షం రూపేణా మనకిచ్చే మేఘాల్ని సృష్టించడంలో సూర్యుడి పాత్ర అందరికీ తెలుసు. నిజానికి సూర్యుడు లేకపోతే మన రేడియోలన్నీ మూలపెట్టి కూర్చోవలసిందే. సూర్యుడింత ప్రయోజనకారి అని తెలియకముందే ప్రాచీనులంతా ప్రతిదేశంలోనూ సూర్యుణ్ణి దేవుణ్ణి చేశారు. దానికొక 'డు' కారం చేర్చి పుంలింగాన్ని చేశారు. ఈనాటికీ సూర్యుణ్ణొక పదార్థగోళంగా వ్రాద్దామన్నా, పుంలింగ 'డు' కారాన్ని తీసివేద్దామన్నా మనస్సు యెంతో బలవంతం చేయవలసి వస్తున్నది.

ఇంతవరకు సూర్యుని వేడి సంగతి మాట్లాడుకొన్నాం. సూర్యుడి కేంద్రంలో వేడి రెండు కోట్ల డిగ్రీలకు పైన వుంటుందన్నాం. అలాగే వొత్తిడికూడా సూర్యుడిమీద విపరీతంగా వుంటుంది. భూతలంమీద గాలి వొత్తిడి ఒక చదరపు అంగుళానికి 15 పౌనులు. వాతావరణ భారం సహించడానికి యీమాత్రం గాలి వొత్తిడి కావాలి మనకు. అందువల్ల దాన్ని మనం ఒక వాతావరణపు వొత్తిడి అంటున్నాం. సూర్యుడి కేంద్రంలోని వొత్తిడి మన వాతావరణపు ఒత్తిడికి రెండుకోట్ల రెట్లుంటుంది.

ఏ పదార్థమైనా వేడి చేసినపుడు వ్యాకోచమవుతుంది. అప్పుడు దాన్ని వొత్తిడికి లోనయేట్లు చేస్తే వెంటనే సంకోచిస్తుంది. సూర్యుడి కేంద్రంలోని వేడి రెండుకోట్ల డిగ్రీలకు పైన వున్నందువల్ల ఆ వేడికి కేంద్రంలోని పదార్థం వ్యాకోచం చెందటానికి ప్రయత్నిస్తుంది. కానీ అక్కడే మళ్ళీ కొన్నికోట్ల వాతావరణపు వొత్తిడి వుంది కాబట్టి వెంటనే సంకోచించడానికి యత్నిస్తుంది. ఈరకంగా సూర్యగోళం కేంద్రంలో అతివుష్ణ-అతిపీడనశక్తులవల్ల మహాసంక్షోభం చెలరేగి వ్యాకోచ సంకోచాల మధ్య నిత్యమూ మహాయుద్ధం నడుస్తూవుంటుంది. ఆ మహా యుద్ధఫలితంగా సర్వదా శక్తి వుత్పన్నమవుతూనేవుంటుంది. ఎల్లప్పుడూ సూర్యుడిలోని మూలపదార్థాలు విచ్ఛిన్నమవుతూ, పునర్నిర్మాణమవుతూ నిత్యపరిణామం పొందుతూనేవుంటవి.

సూర్యమండలంలోనూ భూవాతావరణంలో వున్న మూలద్రవ్యాలే వున్నట్లు వ్యక్తమవుతుంది. భూమిమీద వున్న 92 మూలద్రవ్యాలలో 58 మాత్రం యిప్పుడు సూర్యుడిలో నిర్ధారణచేశారు. మరి 4 కూడా వున్నట్లు కనుగొన్నారు. 18 మూలద్రవ్యాలసలు దొరకటమే లేదు. మిగతా 12 యీనాటి కాంతి విశ్లేషిణులకు అందికలో లేవు. సూర్యుడి వాతావరణంలో వున్న యీ వివిధ మూలద్రవ్యాల్ని గురించి అనేకమంది శాస్త్రజ్ఞులు పరిశోధనలు చేశారు.

ఎచ్. ఎన్. రస్సెల్ వుద్దేశాన్ని అనుసరించి భూవాతావరణంలోని యేమూల పదార్థంగానీ సూర్యవాతావరణంలో లేదనుకోడానికి వీల్లేదు. ఎందుకంటే భూమిమీద యీనాటివరకూ 92 మూలద్రవ్యాలున్నట్లు కనుగొన్నారు. అందులో ఉదజని, బొగ్గు, నత్రజని, ఆమ్లజని, సోడియం, మెగ్నీజయం, అల్యూమినియం, సిలికాన్, భాస్వరం, గంధకం, క్లోరిన్, పొటాసియం, కాలిసియం, యినుము—యీ 14 మాత్రమే అధికంగా వున్నయి. భూమిమీద అధికంగావున్న యీ 14 మూలద్రవ్యాలే (భాస్వరం, క్లోరినులు తప్ప) సూర్యుడిలోనూ అధికంగా వున్నవి. భూవాతావరణంలోకంటే సూర్యుడిలో అధికంగా యెక్కువ భాగాల్లో వున్న మూలద్రవ్యాలు ఉదజని, హీలియం. ఈ రెండూ భూమిలో అధనంగా లేకపోవడానికికూడా కారణం లేకపోలేదు. సూర్యుడిలోనించి చీలివచ్చినప్పుడు అతిగమన వేగంగల హీలియం, ఉదజని మూలద్రవ్యాల పరమాణువుల్ని నిలుపుకోగలిగినంత గురుత్వ శక్తి భూమికి లేకపోయింది.

పోగా సూర్యుడిలో హీలియం వుందని 1868లో లాకియర్ అనే శాస్త్రజ్ఞుడు కనుగొన్నాడు. ముందుగా అది సూర్యుడిలో వుందని కనుగొన్న తర్వాతనే భూమిమీదకూడా వుందని కనుగొన్నాడు. ఉదజని పరిమాణాన్ని బట్టి చూస్తే సూర్యుడిలో మూడోవంతు బరువును ఉదజనే కలిగివుంది. దానివల్ల ఉదజనే హీలియంగా మారుతున్నదనీ, అందువల్ల కోట్లకొలది సంవత్సరాలు సూర్యుడీవిధంగానే వుంటాడనీ తేలుతుంది.

# నియంతృత్వమా? ప్రజాస్వామ్యమా?

## ఐరోపా ప్రజల సమాధానం

భట్టిప్రోలు హనుమంతరావు

రెండు యుద్ధాల మధ్యకాలంలో ప్రపంచ రాజకీయాలయం దనేక వింత పరిణామాలు జరిగినై. నాటివరకూ సాంప్రదాయంగానున్న పార్లమెంటరీ డెమాక్రసీని మొదటి ప్రపంచ యుద్ధం సమూలంగా కదిలించింది. పార్లమెంటరీ డెమాక్రసీకి తాత్వికంగా ఆధారమైన లిబరల్ సిద్ధాంతాలలో ఆదర్శాలకు ఆచరణకు మధ్యవచ్చిన వ్యత్యాసాలవల్లనే ఆ తత్వంలో ప్రజలకు విశ్వాసం సడలింది. లిబరలిజం, స్వేచ్ఛా సహకార సమాజాన్ని నిర్మించ ప్రయత్నించినప్పటికీ, వ్యక్తి మానవత్వాన్ని బలి తీసికొని పెరిగిన సంస్థలకు ప్రోత్సాహం ఇచ్చింది. సర్వ సమానత్వాన్ని ప్రకటించినప్పటికీ కాపిటలిజాన్ని సమ్మతించటంవల్ల ప్రజల్లో ఆర్థిక అసమానత్వం మితిమీరి పోయింది. ఈ ఆర్థిక హాని సత్వం, లిబరలిజం ప్రసాదించిన రాజకీయ స్వాతంత్ర్యాన్ని అర్థరహితం గావించింది. ఉత్పత్తి పంపిణీలలోని వ్యత్యాసాలవల్ల — పదేండ్లకోసారి — ఆర్థిక క్లిష్టత ఏర్పడి ప్రజల జీవితాలు దుర్భరమైపోయినై. ఈ విధంగా లిబరలిజంలో 'ధనం పెరిగి మనుష్యులు క్షీణించటం' మాత్రమేగాక ఆర్థిక క్లిష్టతలవల్ల 'ధనం పెరగక పోయినప్పటికీ మనుజులు క్షీణించసాగారు.'

లిబరలిజంపైనా, లిబరల్ సంస్థలపైనా తిరుగుబాటుగా జరిగింది రష్యా విప్లవం. ఈ విప్లవంలో ఆర్థిక రాజకీయ అధికార కేంద్రీకరణ-నియంతృత్వం-ముఖ్య సూత్రం. లిబరలిజం అసమర్థత ఇటలీ జర్మనీ విప్లవాలతో పూర్తియైంది. ఈ దేశాల్లోగూడా రష్యా ఒరవడితోనే విప్లవాలు జరిగి నియంతృత్వాలు స్థాపింపబడినై. ఐతే రష్యాలో శ్రామిక నియంతృత్వం, ఇటలీ జర్మనీలలో పెట్టుబడిదారీ నియంతృత్వం. ఒకటి కమ్యూనిజం, రెండవది ఫాసిజం. బాధిత లోకానికి రష్యా తాత్కాలికంగా ఆశగా కన్పించినప్పటికీ ఒక దశాబ్దంలో రష్యా ఇచ్చిన వాగ్దానాలన్నీ ఎండమావులు గాజొచ్చినై. స్టాలిన్ నాయకత్వంలో ఫాసిజానికి, కమ్యూనిజానికి - రెండూ ఏక పార్టీ నియంతృత్వాలే గదా — లక్షణసామ్యం ఎక్కువ గాజొచ్చింది. ఫాసిజం జాతీయ స్వామ్యవాదానికి దారి తీస్తే, కమ్యూనిజం స్వామ్యవాద జాతీయ భావాల్ని కలిగించింది. ఫాసిజం జాతి దృష్టిలోనూ, కమ్యూనిజం సర్వ సమానత్వం సాధించాలనే ఉద్దేశ్యంగల పార్టీ క్రమశిక్షణలోనూ వ్యక్తిని, వ్యక్తి సర్వతో ముఖాభివృద్ధిని పూర్తిగా అరికట్టినై. ఈ రెండు సిద్ధాంతాలూ ప్రపంచాన్ని పశుశాలగా మార్చటానికే ప్రయత్నం చేసినై. ఇక లిబరలిజం మానవజాతిని ఒకవైపు కీడిస్తే, నియంతృత్వ సిద్ధాంతాలు మరొకవైపు కీడ్చినై. ఒకటి వ్యక్తికి సంపూర్ణ స్వేచ్ఛ నిచ్చి నిస్సహాయునిగా అంధకూపంలో విడిచిపెడితే, రెండవది వ్యక్తినే గుర్తించక అతణ్ణి వ్యవస్థకు బలి నిచ్చింది. ఈవిధంగా ఈరెండూ సిద్ధాంతాలు వ్యక్తిశ్రేయస్సుకు భంగం కలిగించేటట్టు పరిణమించడంచే ఆచరణయోగ్యాలుగా కన్పించలేదు ప్రజలకు.

రెండవ ప్రపంచ యుద్ధంలో ఫాసిజం నశించింది; లిబరల్ కమ్యూనిస్టు సిద్ధాంతాలే-తాత్విక బలం పూర్తిగా కోల్పోయినప్పటికీ-విజయవంతంగా బైలుపడ్డయి. లిబరలిజంలో లోపాలను పూర్తిగా చూచాం. లిబరల్ సిద్ధాంతాల అప్రయోజకత్వాన్ని గుర్తించి, కమ్యూనిజాన్ని ద్వేషించినవారే ఫాసిజానికి బలం చేకూర్చారు. ఫాసిజం, వారికి మంచి గుణపాఠం చెప్పింది. ఇటు కమ్యూనిజం యుద్ధానంతరం అంతర్జాతీయ రాజకీయాల్లో వినాశాత్మకమైన విధానం అవ

అందిస్తుండటంవల్ల వారి సానుభూతిని పొందలేక పోయింది. అందుచే ఈ రెండు సిద్ధాంతాలూ అంటే లిబరలిజం, కమ్యూనిజం ప్రస్తుత స్థితికి కారిపోవు. అదీగాక ఈ సిద్ధాంతాలు నేడు ప్రపంచాధిపత్యానికి పూనుకోటం మరొక అపాయం. ఈ విధంగా ప్రపంచం నేడు కూలిపోతున్న సిద్ధాంతాలకు, ఆచరణలో భయంకర రూపం వహించిన సిద్ధాంతాలకు జరిగే సంఘర్షణలో నలిగి పోతోంది.

లిబరలిజం, కమ్యూనిజాలకు ప్రాతినిధ్యం వహించి ప్రపంచాధిపత్యానికి పూనుకొన్న రష్యా అమెరికాలకు సంఘర్షణ—యుద్ధం తప్పని సరేమో! ఈ రెండు రాజ్యాలకు, తమ అధికార వ్యాప్తికి అనుకూలంగా ఉన్నది ముఖ్యంగా పశ్చిమ ఐరోపా. ఇచటి దేశాలన్నీ యుద్ధ భీభత్సంవల్ల పూర్తిగా నలిగిపోయినై. పరిశ్రమలు, వ్యవసాయమూ కూలబడినై. అత్యవసరమైన వాటికే ప్రజలు అల్లాడుతున్నారు. స్వయం పునర్నిర్మాణానికి దేశాలు సమర్థాలుగా లేవు. పర సహాయం అత్యవసరం, జరూరు- ఈ దుస్థితి నుండి బైటపడాలంటే. ఈ పరిస్థితులలో నున్న ఈ దేశాలపై తమ ప్రాబల్యాన్ని స్థాపించ ప్రాకులాడుతున్నాయి రష్యా అమెరికాలు. తమ ఆశయ పూర్తికి, పశ్చిమ ఐరోపా ఉద్ధరణకు ఈదేశాలు ఎంతవరకు సమర్థములై ఉన్నవో, వారి విధానము లేవో ఇంచుక పరిశీలిద్దాం.

## రష్యా రాజకీయాలు

రష్యా ఆర్థికస్థితి యుద్ధం దెబ్బనుండి ఇంకా కోలుకోలేదు. అందుచే విదేశాలకుగ ఆర్థికసహాయంచేసే స్థితిలో రష్యా లేదు. రష్యా సాయం, లేక రక్షణ నంగీకరించినవారు రష్యా సిద్ధాంతాల నంగీకరించి, తమ జాతీయ శ్రేయస్సులకు రష్యా అధికారానికి, రక్షణకు బలి గావించాలి. టిటో సంఘటన, బాల్కన్ ఫెడరేషన్ స్థాపింప యత్నించిన డిమిట్రావ్ కథ, పోలెండ్ రుమేనియాలలో గోముల్కా పెట్రావస్కునోల పదచ్యుతి పై విషయాన్ని రుజువుచేస్తై. మరొక విషయం. కమ్యూనిజం విప్లవ లేక ప్రళయవాదం. రష్యా సాయంతో సాంప్రదాయంగా ఉన్న సంస్థల ద్వారా సామ్యవాదాన్ని నిర్మించడం రష్యాకు సమ్మతం గాదు కమ్యూనిజం విప్లవం ద్వారానే స్థాపింపబడాలని రష్యాభావం. అందుచేత ప్రజాస్వామ్యానికి కమ్యూనిజానికి పొత్తు కుదరదు. చెకోస్లోవాకియాలో బెనిష్ మాజరిక్‌ల చరిత్రే దీనికి తార్కాణం. మరొక రహస్యం. అసలు ఈ దేశాల్లో అరాజకం ఉండాలనే రష్యా కోరేది; అట్టి సమయంలోనే కమ్యూనిజం వ్యాపిస్తుంది; తాత్కాలిక ఆర్థికశాంతి ఏర్పడితే ఆ అవకాశం రష్యా కోల్పోతుంది. ఈవిధంగా రష్యా సహాయం చేసే స్థితిలోనూ లేదు, ఆ సహాయం వాంఛనీయమూ కాదు, అసలు రష్యాకు సహాయం చేసే ఉద్దేశ్యమూ లేదు.

## అమెరికా అర్థనీతి

ఇక మిగిలింది అమెరికా. మార్షల్ ప్రణాళిక ద్వారా పశ్చిమ ఐరోపా పునర్నిర్మాణానికి ఆర్థిక సహాయం చేయ పూనుకొన్నది. ప్రస్తుతం అత్యవసరమైన కూడుగుడ్డలు, వ్యవసాయ సాధన సామగ్రి, ఔషదాలు ఈ రాజ్యాలకు సరఫరా చేయబడతై, ప్రజ లారోగ్యవంతులై తమ పరిశ్రమలను వ్యవసాయాన్ని స్వయంగా పునర్నిర్మించుకో గలరనే ధైర్యం వచ్చేంత వరకూ. 1952 నాటికి ఈ దేశాలన్నీ తమ కాళ్ళపై తాము నిలబడగలవని అంచనా వేయబడింది. కాని అమెరికా సహాయంలో కొన్ని అపాయాలు లేకపోలేదు. సహాయం చేయటంలో అమెరికా ముఖ్యఉద్దేశం రష్యా ఆక్రమణను, కమ్యూనిజం వ్యాప్తిని అరికట్టడం మాత్రమే. అందుచేత దేశంలో ఎంతటి అభివృద్ధి నిరోధక శక్తులైనా అమెరికాచేత ప్రోత్సహించబడవచ్చు కమ్యూనిస్టుల నరికట్టే సామర్థ్యం ఉన్నట్టయితే. చైనా అనుభవమే ఇందుకు నిదర్శనం. అంతే కాదు. అమెరికా సహాయాన్ని రష్యా అంగీకరించి ఊరుకోంటుందా? అమెరికా పెట్టుబడిదారీ విధానానికి నకలుగా ఐరోపా తయారౌతున్న దనే ప్రచారం సాగించవచ్చు. అప్పుడు ఆ దేశాల్లో శ్రామికవర్గాల్లో అరాజకం బయలుదేర వచ్చు. ఐతే, అమెరికా సహాయం ఈ దేశాలు అంగీకరించకపోతే! ఆర్థికంగా నిలవలేని స్థితిలో ఆ దేశాలు రష్యాబారి పడకమానాయా! రష్యా

ఐరోపాలు కలిసినా, అమెరికా ఐరోపాలు కలిసినా ఫలితం ఒకటే. - ప్రజాస్వామ్యానికి భంగమే వాటిల్లుతుంది.

అందుచేత ఈ దేశాలపై అధికమగు భారం పడింది. ప్రజాస్వామ్యాన్ని ఉద్ధరిస్తూ, ప్రపంచాధిపత్యానికి పోటీ చేస్తున్న రష్యా అమెరికాల మధ్యలోకం చెడిపోకుండా జాగ్రత్తగా చూసుకు రావడం- ఆత్మశ్రేయస్సుకీ, ప్రపంచశ్రేయస్సుకీ కూడా- వారి విధ్యుక్తధర్మం ఐంది. ఈ విధంగా తాత్విక రంగంలోనూ, ఆచరణలోనూ కూడా ఈ రాజ్యాలవారు ఒక క్రొత్త మార్గాన్ని అనుసరించవలసివచ్చింది.

## ప్రజాస్వామ్య పక్షాలు

ఈ దేశాల్లో అధికారానికి రెండురకాల పార్టీలు పోటీ చేస్తున్నై. అందొకరకం సాంప్రదాయంగావున్న పార్టీలు. ఇవి, కన్సర్వేటివ్ పార్టీలు, కమ్యూనిష్టు పార్టీ. కన్సర్వేటివ్‌లు పూర్తి పెట్టుబడిదారీ విధానాన్ని సైనికబలంతో స్థాపించాలని చూస్తున్నారు, అంటే నియంతృత్వమే; ఇక కమ్యూనిస్టులు, ఆర్థిక అరాజకమే సాధనంగా శ్రామిక నియంతృత్వాన్ని కొమిన్ ఫారం సహాయంతో స్థాపించాలనీ- ఒకరు పూర్తి రైటిస్టులు, మరొకరు పూర్తి లెఫ్టిస్టులు. కాని ఇద్దరి ఆశయం నియంతృత్వమే కాబట్టి ఇద్దర్నీ రైటిస్టులనే అంటున్నారు. రెండవరకం-సోషల్ డెమోక్రాట్లు, క్రిస్టియన్ డెమోక్రాట్లు. ఈ పార్టీల చరిత్ర కొంచెం పరిశీలిద్దాం.

మార్క్సు ప్రకారం పెట్టుబడిదారీ విధానంలో సమాజం పెట్టుబడిదారీవర్గం, శ్రామిక వర్గం అనే విరోధవర్గాలకూటమిగానై సంఘర్షణద్వారా కమ్యూనిజం వస్తుందని. కాని పెట్టుబడిదారీ విధానం, మార్క్సు సూచించిన మార్గం తప్పింది పరిణామంలో. యంత్రాభివృద్ధివల్ల, వాణిజ్యవ్యాప్తివల్ల ఈ రెండు వర్గాలకు మధ్య మరొకవర్గం బయలుదేరింది. దాన్నే మధ్య వర్గ మన్నారు. ఈ వర్గాన్నికూడా కమ్యూనిస్టులు బూర్జువావర్గంక్రిందనే జమకట్టటంవల్ల తబ్బిబ్బులకు లోనౌతున్నారు. వీరు కాయకష్టం మీద ఆధారపడవలసినవారూ కాదు, పెట్టుబడిదారులూ కాదు. మానసిక పరిశ్రమ వీరివృత్తి: విద్యాధికులు, ఆలోచనాపరులు. వీరికి విప్లవాల అనుభవం ఉంది. లిబరలిజంలో వీరికి విశ్వాసం సడలి చాలా కాలమైంది. కమ్యూనిజం, ఫాసిజముల మధ్య ఊగులాడారు. కాని యుద్ధానికి పూర్వంనుండీ వ్యక్తిస్వాతంత్ర్యాలు, మానవ నైతికసూత్రాలు, ప్రస్తుత నాగరికతా సంస్కృతులపైనే దండెత్త ప్రారంభించిన కమ్యూనిజం ఫాసిజాలయందు వీరికి ద్వేషం అధికమైంది. యుద్ధానంతరం ఈ వర్గాలు బాగా బలపడినై. నైతిక విలువలతో వ్యక్తి సమాజానికి కేంద్రం కావాలని వీరి ఆశయం. అమలులో వున్న సంస్థల ద్వారా ప్రజాస్వామ్యం సాధించాలని, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను బలి చేయకుండా అభివృద్ధికరమైన నిర్మాణం సాగించాలనీ, నైతికంపు పునాదులపై నైతిక సాధనల ద్వారా శాస్త్రీయ సమాజం నిర్మించాలనీ వీరి ఆశయాలు. క్రిస్టియన్ డెమోక్రాట్లు ప్రపంచ అశాంతికి, వ్యక్తి నైతిక పతనానికి మతకారణాలు చూపించినప్పటికీ, ఉద్దేశించిన సమాజ పునర్నిర్మాణంలో సోషల్ డెమోక్రాట్లతో ఏకీభవిస్తారు.

ఈ విధంగా ఒక రకం పక్షాలు నియంతృత్వానికి, తద్వారా రష్యా అమెరికాల సంఘర్షణకు దారితీసే పద్ధతిలోనూ; మరొక రకం పక్షాలు ప్రజాస్వామ్య పక్షంలోనూ ఉన్నట్లు తేలింది విషయం. అందుచేత నేడు ఐరోపా ముందున్న ప్రశ్న పెట్టుబడిదారీ విధానమా లేక కమ్యూనిజమా అని కాదు; ప్రజాస్వామ్యమా లేక నియంతృత్వమా అని- యుద్ధమా, ప్రపంచ శాంతియా అని.

## మధ్యవర్గ ప్రాముఖ్యం

ప్రపంచ శాంతి, ప్రజాస్వామ్యమూ మధ్య వర్గాలపైనే ఆధారపడి వున్నవి. ఈ వర్గం ప్రపంచమందన్ని దేశాల్లోనూ ఏర్పడింది. అమెరికా సెక్రటరీ ఆఫ్ స్టేట్ అమెరికాలో మధ్య వర్గ ప్రాముఖ్య బాధ్యతలను గురించి మాట్లాడుతున్నాడు. భారతదేశంలో కూడా ఈవర్గం ఉన్నది కాని ఇంకా జాతీయభావంతోనే కొట్టుమిట్టాడుతుండటం వల్ల, తన విధిని సక్రమంగా నిర్వర్తించ లేకపోతోంది. ఇంగ్లండులో లాస్కీ-

నాయకత్వమున లేబర్ పార్టీ ఈ వర్గ ఆశయములనే ఆచరణలో పెట్టుకొందనవచ్చు. బ్లమ్ నాయకత్వాన ఫ్రాన్సులో, సారగట్-డీ గాస్పరీల ఆధ్వర్యాన ఇటలీలో, వాన్ ఫ్రాన్ అధిపత్యాన హాలెండు దేశంలో ఈ ఉద్యమం నడుస్తోంది. ఇటలీ కమ్యూనిస్టు పార్టీ నాయకుడు టోగ్లియాటీ సహచరుడైన సెకియా- "టూరిన్, మిలాన్, జినోవాల్ని కేవలం ప్రొలిటేరియట్ కేంద్రాలుగా పరిగణించరాదు. టెక్నీషియన్లకు, ఉద్యోగస్థులకు, ఆర్టిజాన్లకు కూడా అవి బలీయమైన కేంద్రాలే. సోషల్ డెమోక్రటిక్ శక్తులు ఆధారంగా వీరు కార్మిక రంగంలో మార్పులు తీసుకురాగలరు" అన్నట్లు, కార్మిక ఉద్యమాలలో కూడా నూతనదృక్పథం ప్రారంభమైంది: 1947 డిసెంబరులో ఫ్రాన్సులో కమ్యూనిస్టు ఆధ్వర్యాన జరిగిన సమ్మె విఫలం గావటానికి ఈ వర్గమే కారణం. ఫ్రాన్సులో కమ్యూనిస్టు ట్రేడ్ యూనియనునుండి వేరై కార్మికులు మరొక కేంద్ర ట్రేడ్ యూనియన్ సంస్థను స్థాపించారు. ఇటలీలోకూడా 1948 ఎన్నికలలో కమ్యూనిస్టులు పూర్తిగా ఓడిపోయారు. డీ గాస్పరీ పార్టీయే అధికారంలోకి వచ్చింది. డెమోక్రటిక్ పార్టీలన్నీ సహకారంతో పనిచేసే సూచనలూ కన్పిస్తున్నై. ఈ విధంగా మధ్యవర్గ ఉద్యమంతో కమ్యూనిస్టుబలం ఐరోపాలో క్షీణించటం ప్రారంభించింది. ఫ్రాన్సులో డీగాల్ బోటి కన్సర్వేటివులుకూడా బలహీను లౌతున్నారు.

### ఐరోపా పార్లమెంటు

అధికారంలోకి వచ్చిన, వస్తున్న ఈ వర్గం కార్యక్రమంలో మొట్టమొదటిది- యుద్ధంవల్ల నష్టపడ్డ తమదేశ ఆర్థికవిధానం చక్కబరచటం. ప్రపంచంలో ఏర్పడ్డ పరిస్థితులవల్ల తమ ఆశయ సాధనకు వీరు, ప్రపంచశాంతికి విఘ్నప్రాయములైన రెండుసాంప్రదాయాలను-జాతీయవాదము, పెట్టుబడిదారీ విధానం- విడచిపెడుతున్నారు. ప్రపంచంలో ఏ దేశమూ తన సమస్యలను తానే ప్రత్యేకంగా పరిష్కరించుకోలేదనే విషయం రూఢిఅయింది. ఒక దేశంలో శాంతికి ఇతరదేశాలతోకూడా సంబంధం ఉంది. అశాంతి నియంతృత్వ శక్తులకు దారితీయవచ్చు. అందుచేత పశ్చిమ ఐరోపాదేశాలన్నీ తమతమ దేశాల్లో శాంతి సాధనకు సహకార భావంతో కృషిచేయాలి. స్వశక్తిలేని చిన్న దేశాలను సన్నిహితంగా వున్న పెద్ద రాజ్యాలు తమ ప్రాబల్యంలోకి ఈడ్వవచ్చు. ఐరోపా స్థితి సరిగా ఈ విధంగానే వుంది. బలహీనంగా ఉండే ఐరోపాయే రష్యా అమెరికాల భయానికి కారణం- ఆ దేశాలు ఎవరి ప్రాబల్యంలోకి పోతాయోఅని. అందుచేత ఈ దేశాలన్నీ పరస్పర సహకారంతో సమైక్యభావంతో కృషిచేస్తే వీటికి రష్యా అమెరికాలమధ్య ఊగులాడే దౌర్భాగ్యం తప్పుతుంది, ఐక్య ఐరోపా రష్యా అమెరికాల మధ్య శాంతిని స్థాపించటానికి దోహదమిస్తుంది. ఈ ఉద్దేశాలతోనే సంయుక్త ఐరోపా ఉద్యమం ప్రారంభమైంది. ఈ సంవత్సరం ఆగస్టులో ఐరోపా పార్లమెంటు ఏర్పడింది, ఒక కార్యక్రమంతో. ఈ సంస్థ సమైక్య ఐరోపా, లేక, ఐరోపా సంయుక్త రాష్ట్రసాధనకు పూనుకొంటున్నది.

ఐరోపా సమైక్యత సాధించటంతో వీటిపని పూర్తికాలేదు. ఈ దేశాల ఆర్థిక పునర్నిర్మాణం జరూరైన సమస్య. ఆర్థికపునర్నిర్మాణానికి విదేశ సహాయం అత్యవసరం. అమెరికా సహాయంలోని ఉద్దేశ్యం, రష్యా భయం మనం పరిశీలించాం. రష్యాభయం ఐరోపాదేశాల్లో పోటీ మూలసూత్రమైన సాంప్రదాయికపు పెట్టుబడిదారీ విధానం పునరుద్ధరింపబడుతుందనే. కాని ఈ దేశాల పరిస్థితి పెట్టుబడిదారీ విధానం యథాతథంగా నెలకొల్పటానికి వీలుకలిగించదు. అసలు ప్రపంచంలోనే మార్క్సు సూచించిన, కమ్యూనిస్టులు నేడు ఊహించే పెట్టుబడిదారీ విధానం పునరుద్ధరింపబడజాలదు. పారిశ్రామిక రంగంలో పెట్టుబడిదారు, పరిశ్రమల నడిపేవాడు ఒకరు కాదు. ట్రేడ్ యూనియన్లు బలపడటంవల్ల పెట్టుబడిదారుల ఆటలు పూర్వంవలె సాగవు. అంతేకాక వ్యవసాయ సహకారోద్యమం, వాణిజ్యంలో సహకారోద్యమాలు పెట్టుబడిదారీ విధానాన్ని కదలించివేసినై. అందువల్ల రష్యా ప్రచారానికేమీ ఆస్కారం లేదు. అంతేగాక పరస్పర సహకారంతో పున

ర్థిర్మాణోద్యమానికి పూనుకొన్న ఈ దేశాలు పోటీ గుణాన్ని విడిచిపెట్టాల్సి ఉంది. పోటీయే పెట్టుబడిదారీ విధానానికి గుండె.

ఈ కారణాలవల్ల, అమెరికా సాయంతో సహకార ఆర్థిక విధానాన్ని అమలు జరపడం ఐరోపా పార్లమెంటు విద్యుక్త ధర్మం. ఒకే విధమైన సమస్యలే దేశాలన్నిటినీ ఎదుర్కొంటూండడంచేత అనుసరించే ప్రణాళికలో సమైక్యత ఉండటానికి వీలుంది. ఈ దేశాల్లో తయారవుతున్న ప్రణాళికలవల్ల మునిసిపాలిటీలు, రాష్ట్ర సంఘాలు, సహకార సంఘాలు పరిశ్రమలు నడిపే సూచనలు కన్పిస్తున్నై. కేవలం లాభ దృష్టితో గాక ప్రయోజన దృష్టితో వస్తు ఉత్పత్తి సాగుతుంది. ఒక దేశంనుండి మరొక దేశానికి వస్తు సరఫరా నిరాటంకంగా - సుంకాలు లేకుండా - సాగుతుంది. ఇంతేకాక ఈ దేశాలన్ని కలిసికూడా ఉమ్మడిగా పారిశ్రామిక రంగంలో కృషిచేసే అవకాశాలు లేకపోలేదు.

ఈవిధంగా ప్రపంచ రాజకీయాల్లో జాతీయ సంకుచితత్వాన్ని వీడి, వర్గపార్టీల్ని దృష్టిలో ఉంచుకోనక ప్రజాశ్రేయస్సుకై పనిచేసే వర్గం బైటపడింది. ఈ వర్గమే ప్రజాస్వామ్యాన్ని అడుగడుగునా నిలదొక్కుకుంటూ విరుద్ధ సిద్ధాంతాలమధ్య సంఘర్షణ రాకుండా చూస్తూ పురోగమిస్తోంది. ప్రతి దేశంలోనూ ఈ ఉద్యమాలున్నై. అవి బలపడి ప్రజాస్వామ్య ఉద్యమానికి ఇతోధికంగా కృషిజరిపితేనే గాని త్వరలో ఐక్యఐరోపా ఐనట్లు, ఐక్య ప్రపంచం యేర్పడదు. ఈ ఉద్యమ ఉజ్వల భవిష్యత్తే ప్రపంచ శాంతికి ఆధారం, ప్రజాస్వామ్యానికి మూలం.



జమినీ వారి "వింత సోదరులు" అను తమిళ చిత్రంలో అభినేత్రి భానుమతి.




కనంబ కళ్లు పరీక్ష చేయించుకోవటానికి ఆసుపత్రికి వచ్చి మా నర్సుని అడిగిందిట- ''మీ మనిషి కనపడటంలే దేమి'' అని. అందువల్ల ఒక సారి చూసి రాకపోతే బాగుండదని బయలుదేరా. నేను రావటం చూసింది కాబోలు అప్పుడే మేడ మెట్లు దిగుతోంది. నేనూ వరండాలో వున్న బెంచిమీద కూర్చునేటప్పటికల్లా ఆమె తన నాటయాత్రమాను పొన్నాని ఎదురుగా వున్న కుర్చీలో చేరవేసి—

'ఏమండీ, అసలు కనపడటమే మానేశారు!' అన్నది.

'పరీక్షలు కదండీ, తిరగటం మానేశాను.'

'ఏం, మొన్న మార్చికి అయిపోలేదూ?'

'కొత్తగా- అడుగుతున్నారే- నా కేలెండర్లో మార్చి తరవాత సెప్టెంబరేగా'

ఆమె నవ్వటం, నేను ఉలిక్కిపడటం ఒక్క సారి జరిగినై.

'బలేవారండీ మీరు'

'ఏం, అట్లా అంటున్నారేం?'

'ఏంలేదు. మీ మనసులో ఏమేమి ఉద్దేశ్యాలుంటాయో తెలుసుకోవాలని అప్పుడప్పుడు అనిపిస్తూ వుంటుంది'

'నా మనసులో అసలు ఉద్దేశాలే వుండవ్. ఏమున్నా వున్నా అందరికీ తెలిసేటట్టు వుంటై.'

'—సరే దానికేం గాని, పరమేశ్వరి ఊరికి వెళ్ళిన సంగతి మీకు తెలుసా?'

'పరమేశ్వరి నాకు తెలీకుండా ఏపనీ చెయ్యదు. ఆమె చేసే ప్రతిపనీ, నే నెక్కడ వున్నా సరే, నాకళ్ళకు కట్టినట్టు కనపడుతుంది—మీరు నవ్వక్కర్లేదు—సీరియస్‌గానే చెప్తున్నా.'

'అయితే మీకు దివ్యదృష్టి వుందన్నమాట—లేకపోతేయేదన్నా శక్తినన్నా, దెయ్యాన్నన్నా వుపాసిస్తున్నారా?'

'దెయ్యాన్ని ఉపాసించటంలేదు, దేవత నీ వుపాసించటంలేదు. నా మనస్సే పరమేశ్వరిని గురించిన అన్నివిషయాలూ ఎప్పటికప్పుడు చెప్తా వుంటుంది. నా మనస్సుకి ఆశక్తి వుందని మీరు వొప్పుకు తీరాలి.'

'కంటికి కనపడని లేదా పరిశోధనద్వారా ధ్రువపడని శక్తుల్ని మీరు నా దగ్గిర ముందు చిరా

కొండేపూడి సూర్యకామరాజు

గలిగితేనా - పాలకు ప్రొహిబిషన్ పెట్టి టీ ఎక్స్పాన్షన్ బోర్డుని యింకా ఎక్స్పాండ్ చేసి పారేద్దురు!'

అంత లెంగ్తు అండ్ బ్రెడ్తు వున్న ఆమె యిరుకైన మద్రాసు మినిస్ట్రీలో దూరగలగటం ఎట్లా సాధ్య మవుతుందా అని ఆలోచిస్తున్న నాకు పెదవులు చుర్రుమన్నై, గుండె జల్లుమంది. నా దృష్టి నానోటివద్ద వుంచబడ్డ కప్పునగ్గర బయలుదేరి ఆకప్పుకు ఆధారమైన వేళ్లనిదాటి ముంజేతి గుండా మోచెయ్యిదాటి బలిష్ఠమైన భుజంమీద ఒక్కక్షణం ఆగి ఆ భుజానికి యజమాని అయిన కదంబ ముఖంలో వున్న కళ్లలోకి పోయి వాక్యూమ్ బ్రేకు వేసినట్టు టపీమని ఆగిపోయింది. కదంబ కళ్లలోంచి వస్తున్న నిశితకిరణ పరంపర నాతో 'మర్యాదగా మర్యాదగా యీ టీ తాగక పోతే, మారంపెట్టే కుర్రవాడికి దవడలు దగ్గరగా నొక్కి పళ్లమధ్య స్పూన్ పెట్టి నోట్లో అముదం ఎట్లా పోస్తారో అట్లాగే యీ టీ నీ గొంతులో పొయ్యవలసి వస్తుంది' అంటున్నట్టుగా వుంది. అసలే నొక్కుకుపోయిన దవడల్ని యింకా నొక్కించుకోవటం యిష్టంలేక ఆ అముదాన్ని - పళ్లమధ్య స్పూన్ లేకుండానే - మర్యాదగా గుటుక్కున మింగేశాను.

'—ఇక వర్ణించండి, మీ మనస్సుకున్న విచిత్ర శక్తిని' అని కుర్చీలో కూలబడ్డాను.

'మెయిల్లో మద్రాసునుంచి వస్తూ అకారణంగా బాపట్లలో నేను దిగిపోవటానికి గల కారణం మీరు చెప్పగలరా?' నా ముఖాన్ని సాధ్యమైనంత సీరియస్గా పెట్టి మాటిగా వేశాను ప్రశ్న.

'మీకు కొంచెం ప్రూక్ లాజయి వుండాలి. అంతకన్న నాకు వేరే కారణం కనపడటం లేదు- అయినా మీ మానసికశక్తికీ, యిప్పుడు మీరు వేసిన ప్రశ్నకీ యేమీ సంబంధం లేదు.'

'లేదని మీరనగానే సరా?- మనస్సనేది కంటికి కనపడే పదార్థమే అయివుంటే యీ పాటికి పరమేశ్వరి మనస్సునే పొట్టని శోధన శాలికలోకి తీసుకుని, నా మనస్సునే యానిస్ట్ పోసి ఏ కాంపౌండో మీ కళ్ళకు కనపర్చగలిగే వాడిని. ఈ విధంగా కంటికి కనపడని వస్తువుల యొక్క విచిత్ర శక్తులు ఊహించనయినా వూహించుకోవాలి లేదా అనుభవించనయినా అనుభవించాలి. అంతేకాని కళ్ళముందు చూప మనటం కేవలం వెర్రితనం.'

'అయితే యింతకూ మీ రనేదేమిటి?'

'ఏమంటాను?- నా ప్రశ్నలకు సరైన సమాధానా లిమ్మంటాను- నాకు కలిగిన విచిత్రానుభవాలకు మూలకారణం వూహించటానికి ప్రయత్నించమంటాను- ఇప్పుడు చెప్పండి, పరమేశ్వరి బాపట్లలో వున్న సంగతి నాకెట్లా తెలిసిందో.'

'కుసుమసాధం చెప్పిందేమో?'

'చాలా బాగుంది- ఎక్కడో హైదరాబాద్ సంస్థానంలో వున్న ఆమె గంటకు నలభై మైళ్ళ చొప్పున మద్రాస్ మెయిల్లో పోతున్న నాతో చెప్పిందా?'

'అయితే ఎట్లా తెలిసిం దంటారు?''

'అదుగో, అక్కడే మనస్సు యొక్క అద్భుతశక్తి మనకి గోచరిస్తుంది. ఆ శక్తే నన్ను బాపట్లలో రైల్లోంచి బయటకు లాగి పరమేశ్వరి దగ్గరకు లాక్కుపోయింది- లేకపోతే కల్లో అయినా అనుకున్నానా ఆమె బాపట్లలో వుంటుందని!'

'ఆ శక్తి యిప్పుడు మిమ్మల్ని పిచ్చాసుపత్రికి లాక్కుపోయేటట్టుంది'

'అదే శక్తి, అగమ్యగోచరంగా రోడ్డు వెంబడి నడిచిపోతున్న నన్ను గోల్డ్ లెస్తు టర్న్ ఆని పరక్లోకి యీడ్చుకుపోయింది. లేకపోతే నాకేం తెలుసూ, పరమేశ్వరి పరక్లో నాన్ వెజిటేరియన్ డిష్షస్ వంచుకొంటున్నదనీ?- ఆ శక్తే నాచేత రెండు ఆమ్లెట్లు తినిపించి పరమేశ్వరి చేత బిల్లు చెల్లింపించింది- నవ్వండి, నవ్వండి. మీరు నవ్వినంత మాత్రాన నా దివ్య మానసిక శక్తి దమ్మిడీ అయినా కూడా తరగదు.'

'అయితే మీరు ఆమ్లెట్లుకూడా తింటున్నారన్నమాట'

'నేను తినట మేమిటి?-ఆ శక్తి...ఆ అద్భుత శక్తి... అదే నాచేత తినిపించింది.'

'ఉండండి చిన్న సందేహం, మీ చేత యీ పన్లన్నీ చేయించింది ఒకవేళ ఆ పరమేశ్వరి శక్తేనేమో!

'కేవలం ఆమె శక్తి కాకపోయినా ఆమె మానసిక శక్తి కొంతవరకూ పనిచేసి వుండొచ్చు-

రెండు మనస్సుల యొక్క శక్తులూ కలిసి పని చెయ్యటంవల్ల ఇంతకన్న ఎక్కువ అద్భుతాలు జరుగుతై-ఊఁ, నవ్వండి నవ్వండి."

'అయిందా?-ఇంకా ఏమన్నా వుందా?'

'అంతమంది చుట్టాలూ వుండగా ప్రత్యేకించి ఆ యింటికే ఎందుకు వెళ్ళాలి నేను?-వెళ్ళానే అనుకోండి. ఒక మూలకూర్చోక మేడ ఎందుకు ఎక్కాలి?-ఎక్కానే అనుకోండి. నలభై రూపాయిల బాంక్లెట్ చీర నూరురూపాయిలకు అమ్మే సామాలవాడి షాపువైపే ఎందుకు చూడాలి?-చూశానే అనుకోండి. పరమేశ్వరి ఆ షాపులోనే ఎందుకు కనబడాలి?'

'అది వుత్త కోయిన్సిడెన్స్ కావచ్చు.'

'ఒకటీ రెండూ అయితే కోయిన్సిడెన్స్ అవొచ్చు. ఇటువంటివి రోజూ ఎన్నో జరుగుతుంటే అవన్నీ కాకతాళీయమని ఎట్లా చెప్తాం?-ఇప్పుడు చూడండి- సముద్రంలో కనబడుతోంది చూశారూ, ఓడ. ఆ వోడలోకి నేను వెళ్ళినట్టయితే అక్కడ కనబడుతుంది.'

'ఏమిటి, శక్తా?'

'కాదు. పరమేశ్వరి.'

ఇప్పటి వరకూ నా నోటినుండి వెలువడిన మాటలు యింత కంటె ఒడ్డూ పొడుగూ వున్న వాళ్ళనయినా ఒప్పించి తీరవలసిందే. కాని కదం బంలో కన్విన్స్ అయిన లక్షణాలు అణుమాత్రం కూడా నాకు కనబట్టం లేదు. పైగా హేళనగా నవ్వుతోంది.

'వాగి వాగి అలసిపోయారు. ఈ కాస్త పుచ్చుకోండి. మరి కొంతసేపు వాగొచ్చు.' ఆమె అందించిన టీని అంగుట్లో పోసుకున్నా.

'అయితే యీ విచిత్ర మానసిక శక్తి మీ ఒక్కరికే ప్రత్యేకంగా వుందా లేక అందరికీ సహజంగా వుంటుందా?'

'సహజంగా అందరి మనస్సులలోనూ యీ శక్తి దాగి వుంటుంది.'

'అయితే ఏ శక్తీ నన్ను కలకత్తానించి కాశీ లాక్కుపోలేదేం?- ఏ ఆమ్లెట్టూ నోట్లో కూరలేదేం?'

'ఇప్పటి వరకూ మీ మనస్సుని, బయట నించి వచ్చిన యింకొక శక్తి ఏదయినా పూర్తిగా ఆక్రమించుకొన్నదా?'

'అంటే నా కర్థం కాలేదు.'

'అంటే యింకొక రెవరయినా మీ మన మనస్సుని ఆక్రమించుకొన్నారా?'

'అంత దురదృష్టం నాకు పట్టలేదు.'

'అందుకే మానసికశక్తి విజృంభించ లేదు. మీ మనస్సులో అణగివున్న శక్తిని బయటనించి యింకో శక్తి మీ మనస్సులో ప్రవేశించి రెచ్చగొట్టాలి. అప్పుడు మీ మనస్సు మిమ్మల్ని కలకత్తానించి కాశీ కాదు కదా కాలిఫోర్నియా దాకా కూడా లాక్కుపోతుంది. ఆమ్లెట్టుకు బదులు అర్థసేరు మాంసాన్ని కూడా అమాంతం తినిపించేస్తుంది.'

'మీరు చెప్పింది నాకేమీ అర్థం కావటం లేదు.'

'విచిత్ర మానసిక శక్తి నేను చెప్పిన ప్రతి అక్షరంలోనూ నృత్యం చేస్తుంటే యింకా అర్థం కాకపోవటం మేమిటి?'

'ఇంతకీ పరమేశ్వరి వూరికి వెళుతోన్నట్టు తనే చెప్పిందా, మీ మనస్సు చెప్పిందా?'

'తను చెప్పుంటే?—తెలీకుండా వుడాయిం చేద్దా మనుకుంది. నాకు మనస్సనే అద్భుతమైన పదార్థం వుండబట్టి పరమేశ్వరి ప్రయాణమంతా నా కళ్ళముందే జరిగింది.'

'ఏదీ, అది కూడా కొంచెం వర్ణించండి.'

'సముద్రపు కెరటాలు ఎత్తుగా లేచి విరగ పడుతున్నై. గాలి విక్రీడంగా వుంది. వర్షం జోరుగా పడుతోంది - ఉరుములు ... మెరుపులు...పిడుగులు ... ఒకటేమిటి! - ప్రకృతి గర్భంలో పెద్ద అగ్ని పర్వతం పేలి, ఆ భీభత్సానికి తాళలేక ప్రకృతి ప్రళయ తాండవం చేస్తున్నట్టుగా వుంది—'

'ఇదంతా పరమేశ్వరి ప్రయాణాన్ని గురించేనా?'

'ఈ భీభత్సానికంతకూ కారణం ఏమిటా అని ఆలోచిస్తున్న నాకు హఠాత్తుగా గుండెల్లో ఎవరో తన్నినట్టయింది. లేచి నిలబడ్డా. చలనం కలిగిన నా మానసికశక్తి నన్ను స్టేషన్ వైపు విసిరేసింది. స్టేషన్లో పరమేశ్వరి కనపడటంతో పిడుగులు, మెరుపులు, వర్షం...అన్నీ ఆగినై. ప్రకృతి శాంతించింది - అంటే నామనస్సు నా సోమరిపోతు శరీరాన్ని స్టేషనుకి లాక్కుపోవ

దానికి ప్రయోగించిన శక్తి ప్రకృతికే ఉద్రేకం ఆగించిందన్న మాట. ఇప్పుడు ఆలోచించండి- ఏ రెండుకు వెళ్లాలి, అవసరంలో స్టేషనుకి?- సరే వెళ్లానే అనుకోండి. అయినా యిరవైకి బయలుదేరవలసిన రైలు, నేను వెళ్లేదాకా, వెళ్లాక యింకా గంటన్నరదాకా ఎందుకు ఆగిపోవాలి ప్లాట్ ఫారంమీద? - ఆగకేం చేస్తుంది? మూడు యింజన్లు తగిల్చినా ఆగితీరవలసిందే! - అంటే మా యిద్దరి మనస్సులకూ వున్న అద్భుత శక్తులు రెండూ కలిసి సిగ్నల్ కిందకు దిగకుండానూ, పచ్చ జెండావున్న గార్డు చెయ్యి పైకి లేవకుండానూ, యింజను పనిచెయ్యకుండానూ చేశాయన్న మాట - ఒప్పుకుంటారా యిప్పటికైనా?'

'మీ ముఖం చూస్తే భయమేస్తోంది. ముందు టీ తాగండి, తరవాత చెప్తా.'

కప్పు ఖాళీచేసి అన్నా—

'మీరు ఓడిపోయే పందేలు పెట్టి వ్యర్థపుచ్చే కాలంలో వెయ్యోవంతు బీచిలో పరుగెత్తటానికి వుపయోగిస్తే మీ అంత అందమయిన వాళ్లు యీ పట్టణం మొత్తంలోనే కనపడకుండా పోయేవారు.' ఆమె అందాన్ని పొగడుతూనే ఆమె వోడిపోయిందన్న విషయాన్ని తెలియపర్చా.

'నా ఓటమికాని మీ గెలుపుకాని ప్రస్తుతం నేను వొప్పుకోను. మీరు చెప్పినట్టు నా మనస్సులో యితర శక్తి ప్రవేశించి నా మనస్సులో దాగివున్న శక్తిని రెచ్చగొట్టి మీకు కలిగిన విచిత్రానుభవాలలో ఏకాన్ని అయినా నాకు కలిగిస్తే అప్పుడు వొప్పుకుంటాను. - అందాకా మన పందేన్ని వాయిదా వేద్దాం.'

'అయితే యీలోగా నేను పెట్టబోయే ఒక షరతుకు మీరు వొప్పుకుంటే వాయిదాకి నా కేవిధమైన అభ్యంతరమూ లేదు.'

'ఏమిటా షరతు?'

'సముద్రపు టొడ్డునవున్న యిసకలో రోజూ మీరొక మైలు పరుగెత్తాలి మీరట్లా చెయ్యడం వల్ల యింకొక శక్తి మీలో ప్రవేశించటం మొదలుకావచ్చుకూడా.'

'మీ షరతుకి వొప్పుకుంటూ మీకొక షరతు పెడుతున్నా - ఈ రోజు మొదలు పందెం తేలేదాకా మీరు కాఫీ విసర్జించి రోజూ రెండు పూటలా టీ తాగుతూవుండాలి.'

'అంటే యిరవైనాలుగు గంటల్లో ఏ ఒక్క గంటాకూడా నిద్రపోకూడదన్న మాట!'

ఈ షరతులమీద మా పందెపు ఫలితాన్ని నిర్ణయించే తేదీ కదంబలో యింకో శక్తి ప్రవేశించేదాకా వాయిదా పడ్డది.

నా కేలండర్ కాగితాల్లో మూడు మార్చిలూ, మూడు సెప్టెంబర్లూ చింపాక, అంటే పరమేశ్వరి కాస్మెటిక్స్‌కి మరొక మూడువేలు ఖర్చయ్యాక, అంటే మద్రాసు మినిస్ట్రీలో తొమ్మిదిసార్లు మార్పులు జరిగాక కదంబ పెళ్లికి కలకత్తా వెళ్లాను. పెళ్లి సద్దు అణిగాక పానీయపు పాత్రలు పేర్చబడ్డ గుండ్రబల్ల చుట్టూ వున్న కుర్చీల్లో గుండ్రంగా నలుగురం కూర్చున్నాం.

'ఇంతకీ మిమల్ని కలకత్తా యీడ్చుకువచ్చిన శక్తి గోల్డెన్ లెటర్సులో ముద్రించిన నా యిన్విటేషన్ శక్తా లేక పరమేశ్వరి ప్రేరేపణ శక్తా?' టీ పెదవుల్ని నవ్వుగిస్తూ పెండ్లికూతురు కదంబ అన్నది.

'ఏ శక్తయితే నన్ను బాపట్లలో రైల్లోంచి బయటకు లాగిందో, ఏ శక్తయితే ఇంత విశాల ప్రపంచంలో ఒకే ఒక వ్యక్తిని నాకళ్లముందు కనపరస్తూ వుంటుందో - అదే శక్తి నన్నిక్కడికి తీసుకువచ్చింది!'

'ఈ శక్తినిగురించి నీ అభిప్రాయ మేమిటి పరమేశ్వరీ' కుసుమనాథం అడిగింది.

'ఇటువంటి శక్తి ప్రపంచంలోవున్న మాట నిజమే- ఆశక్తిని సాధారణంగా ఉన్మాద శక్తి అని పిలుస్తుంటారు' నావైపు ఓరగా చూస్తూ పరమేశ్వరి నవ్వింది. తక్కిన యిద్దరు అమ్మాయిలా కూడా నవ్వారు. నేను నవ్వకపోయినా పరమేశ్వరి నవ్వు ముఖాన్ని తనివితీరా చూసి ఆనందించాను.

'మీరు పందెం ఓడినట్టు యిప్పటికైనా ఒప్పుకుంటారా?'

'ఓడిపోకపోతే యింత సన్నంగా ఎందుకుంటాను?- మానసిక శక్తిని గురించి మీరు చెప్పినవన్నీ నిజమని నా కిప్పుడు తెలుస్తోంది.'

ఎక్కడనించో వచ్చి నాలో ప్రవేశించిన యితర శక్తి కొద్దిరోజుల్లో నన్ను కలకత్తానించి మరొక చోటుకి లాక్కు పోబోతున్నది కూడా.'

కదంబలో కొత్తగా ప్రవేశించిన శక్తి ఆమెను గంగానది మీద బోటులో తిప్పింది!

నాటు కేసూ, హార్లిక్సూ పట్టుకుని పరారై పోయే నన్ను పరమేశ్వరి కనుమాపులో వున్న విచిత్ర శక్తి మెట్రోకు తీసుకుపోయింది!

దండం విమానాశ్రయంలో వున్న దకోటా యొక్క యంత్రశక్తి నలభైమందిన్ని అమాంతం ఆకాశంలోకి లాక్కుపోయింది!

కుసుమనాధం మాత్రం, తనచేతటి తాగించటానికి ఏకమైన మా ముగ్గురి (పరమేశ్వరీ, నేనూ, కదంబా) శారీరక మానసిక శక్తుల్నీ జయించి కొబ్బరిచెట్టు కింద కూర్చుని కొబ్బరికాయ నీళ్ళు తాగుతున్నది. ఇన్ని అద్భుత శక్తులకూ అతీతమైన కుసుమనాధం కాళీఘాట్‌లో వున్న కాళీ మహాశక్తేమో—



ఇద్దరు కలిస్తే

# ఇవీ, అవీ, అన్నీ —

పిచ్చి తుగ్లక్ కాలంలో తోలు నాణేలు ఉండే వన్నారు విన్నాం. ఇప్పుడు రూపాయికి కొంత అగౌరవం జరిగిందని బాధపడే వెర్రి వాళ్ళనిగురించీ వింటున్నాం. పాతిక పార్టీ తగ్గిందని, వీక్నైదాకా వెళ్ళిందని, యింకా ఎన్నో అర్థం తెలియని అపోహాలతో అమాయకుల హృదయాలు అట్టుడికిపోతూంటాయి. పోస్టాఫీసులు, బ్యాంకులు మూడుంతలూ ఎందుకు కట్టేశారూ?

"వంటకి ఒకటే నున్న ఉంటుందన్న మాట! ఇది అంతా లోకమక్కు ఫలితంగావును!"

"అది కాదండి. క్రిప్సు చేసిన రభస—"

"ఆ క్రిప్సే-వెనక ఏదో క్రిప్సు రాయబారం అంటూ ఉండేవారు."

"అవును. శ్రీకృష్ణ రాయబారం తర్వాత విన్న రాయబారాల్లో అదొకటి."

"ఎంత చెప్పినా శ్రీకృష్ణ రాయబారం చూడ వలసిన నాటకం లెండి. చాలా అద్భుతం-నాటకాల ప్రతిభ క్రమంగా క్షీణించిపోయింది."

"నిజం—డి. వి. సుబ్బారావు హరిశ్చంద్రుడే వెయ్యాలి."

"అగామనాధశాస్త్రి పద్యం చదవడమే-"

"స్థానం నిజంగా సత్యభామ వేషం——"

"అవును-దొమ్మేటిని 'గంగూన్ రాడీ'లా-"

"లేకపోతే సినిమాల్లో ఏముంది అసలు—"

"అట్లా అంటే ఒప్పుకోవడం కష్టమే కాని-"

"ఇంతకీ సినీమాల్లో మగవాళ్ళ ఆడవేషాలు ఎందుకు వెయ్యకూడదూ?"

"కాస్త ఆలోచించ తగ్గ విషయమే మరి-"

"ఏం సినీమాలు-మాస్తే నాటకం చూడాలి- మూడుగంటల్లో ఎలా రక్తి కడుతుంది-"

"నాటకంలో మనుష్యులు కాదు మరి-సినీ మాలో బొమ్మలేగా. పైగా వన్స్‌మోర్ అనడం ఎలాగ? 'ఏ బందా' లాంటి నటుడో ప్లేటుమీద ఉంటే 'గుత్తి వంకాయ కూర'ని పాడ నివ్వకుండా ఎలా వెళ్ళనిస్తాం?"

"సినీమాలని అల్లా అని పారేస్తే ఎలాగ పాపం-ఎంత వ్యాప్తిలో ఉన్నాయి! నిమిషానికి ఒకటి చొప్పున మాస్తే మాత్రం తరుగుతాయా?"

"అవును, రామాయణ భారతాలు యిదివరకే భ్రష్టి అయాయి. ఎలాగో ఓర్చుకున్నాం- కా శీ మ జి లీ లు ఋ రు వు కూ డా వెళ్ళిపోతాం దనుకుంటాను. ఇంక ఇంగ్లీషు సాహిత్యంమీద పడి ఒక్కొక్కణ్ణీ చిత్రవధ చేస్తోంటే బాధ ఎలాగ భరించడం?"

"అబ్బ! సినీమాల్లో ఇంకా ఎన్ని చూపిస్తారు!- ప్రాల్లో వున్న పన్నెను: 'మైసూరు హెయిర్ కటింగ్ సెలూన్'- శశమూలికాది లేహ్యం- 'టీకాలు వేయించుకోండి'- అన్నట్టు 'డోంగ్రే' వారి బాలామృతం".

"ఇంకా, రాబోవు చిత్రాలయ్యా- న్యూస్ పేరోడ్- కేశవనామాల్లా మన నాయకులు వరసగా కనిపిస్తే వాళ్ళ చేతులు బాదుకోవడం- వెంటనే సోడా, సోడా అనే అరుపులు- నేల మీద కూర్చున్న వాళ్ళలో లేలు, లేలంటూ అల్లరి-

ఈ హడావిడిలో ఎవడో అమాయకుని డబ్బు గల్లంతు- కనీసం ఆ పెయ్యడం కానీపు-"

"ఉండిగా 'వందే మాతరం'- ట్విన్ నామల జబ్బా నగం ఆ ఒక్క రికార్డుకే ఖాళీ చేసే టప్పటికి అంతా నిశ్శబ్దంఆవకాశం జరుగుతుంది!"

"ముందు ముందు వందే మాతరం, జనగణ మనా లేకుండా ఏపనీ జరగడానికి వీల్లేదను కుంటాండి!- ముందు 'జనగణమన' పాడేసి భోజనానికి కూర్చుని, చివర విస్తరి దగ్గరనుంచి లేచి పోయేటప్పుడు 'వందే మాతరం' పాడేసి లేవడం- ఏమైనా అంతే. జాతీయగీతం అవసరమే అంటాం కాని మరి రాష్ట్రానికి కూడా ఒద్దూ- సూర్యకుమారి పాడిన 'మా తెలుగు తల్లికి' అందరం నేర్చుకోవడమే."

"అద్సే, ఆ పాట ఎలాగ? కమ్యూనల్ జీ. వో. నంగతో !"

"ఆంధ్రరాష్ట్రం ఎప్పుడు వస్తుందట ఇంతకీ!"

"తెల్సి పారెయ్య రాజకీయ వేత్త లుంటేనే!"

"కొందరి రాజకీయవేత్తలకి కాస్త బుఱ్ఱ చెప్పినమాట వినదంటారు నిజమేనా ?"

"కాస్త అంటారేమిటి కర్మ- బాగా తల కెక్కి పిచ్చెత్తిన వాళ్ళను చూడలేదూ!"

"ఎల్లాగైనా పిచ్చివాళ్ళతో సంచరించడం కష్టం చాలా- పిచ్చితనం కొంత, ఉపాధ్యాయుల్లో ఉంటుందనడం వాస్తవమేనా!"

"అయితే అవవచ్చు."

"వాళ్లు ప్రపంచానికి దూరమైపోతారనా- జాగ్రఫీ మేష్టారు ఎప్పుడూ సహారా ఎడారి అంటూ ఉండవలసిందే."

"నిజమే- తెలుగు మేష్టారు 'చంపకమాల' అంటూ జీవితం అంతా గడుపుతాడు మరి."

"ఫిలాసఫీ కోర్సులో కుర్రాళ్లు చాలా తక్కువగా ఉంటారంటే!"

"వేదాంతానికి కొన్ని వేళలు ఉన్నాయి. ఏదేనా చిన్న 'టీకప్పులో తుఫాను' వస్తేనే కాని వాడకం ఉండదు. కష్టం ఏదైనా కల్గితే, లేకపోతే ఏదేనా విచారం తటస్థ పడితే- ఏం చేయాలి, జీవితం తిన్ననైనగీత కాదనుకోవడమే- మెరక పల్లాలు, హెచ్చుతగ్గులు-ఇంకా ఏవేవో చెప్పేస్తేసరి. ఎంత తృప్తిగా ఉంటుంది - నాలుగైదు ముక్కలు కాస్త చురుకుగా వాడ్డం తెలియాలి- జీవుడు, ఆత్మ, పరమాత్మ, సృష్టి, మాధవుడు వగైరా - వీటితో తోలు బొమ్మలాట వెయ్యడం-అంతే."

"అలాగా! వేదాంతంకూడా ఇంట్లో వంట మనిషిలాగే అవసరం అన్నమాట!"

"ఎన్నో రకాల వేదాంతాలు - ఎవడికి ఏది వచ్చితే అది. ఏదో ఒకటి మనకి వచ్చిందను కోవటం కొంతమందికి నాగరికతా లక్షణం కూడానూ-శివానందస్వామి, రాధాస్వామి, అరవింద, రమణ మహర్షి వగైరా అందరికీ తలో పద్ధతి అంటారు-"

"హరీంద్రనాథ్ చట్టోపాధ్యాయ రమణ మహర్షి దగ్గర ఉన్నాడంటారు-చాలా గొప్పవాడు లెండి-గొప్ప రచయిత."

"బెంగాలు సాహిత్యం ఎలాగైనా చాలా వృద్ధి పొందిందిలెండి."

"మనకా బెంగ అవసరంలేదు- తెలుగులోకి అన్నీ తర్జుమా అయితేనే- వాళ్లు రెండో క్లాసులో వ్రాసినకథలూ తర్జుమా చేయబడ్డాయి."

"ఇతర సాహిత్యం బాగా రవాణా అవుతోందంటారా?"

"ప్రమాదం లేదు - 'అనుకరణ' లాంటి ఆయుధాలు చేతుల్లో ఉన్నాక - పత్రికల్లో పేరు పడుతుంది. తప్పకుండాను."

"అఁ, ఏమిటో రచయితలవల్ల దేశానికి ఏం ఉపయోగం ఉంది కాని-"

"నిరాహార సమస్యమీద కొన్ని దస్తాల కాగితాలు ఖరాబుచేస్తేనే ఉపయోగం ఉందన్నమాట - రేడియోలు పాటుపడుతున్నాయిగా, వారానికి రెండు పుంటీల ఉపన్యాసాలు వినిపించడానికి! - న్యూస్ పేపర్లు చూసేదేమిటి రోజూ- వీటికోసం ఎంతసిరా ఖర్చో తెలుసా?"

"ప్రమాదాలు తీసుకువచ్చి రైళ్లుకూడా కొంత జనాభాని తగ్గిస్తోంటేనే-"

"ఇంకా ముందుముందు జనాభా ఎక్కువైతే కష్టం కాదంటే?"

"ఏమీ పరవాలేదు. మన దేశంలో తయారయిన విమానాలన్నీ రోజూ తుక్కుల్లా తిప్పేస్తే సరి - రైల్లోంచి పడ్డవాడికి కొంత తిరుగుంటుంది గాని - విమానంలోంచి పడితే సరి.-"

—వి. ఆర్. శాస్త్రి




(గతసంచిక తరువాయి)

## రాజశేఖర రాయలు

(క్రీ. శ. ౧౪౬౮-౧౪౭౧)

విద్యారణ్య కాలజ్ఞానమందు 'మ' సంజ్ఞుని యనంతరము 'రా. ౨' సంజ్ఞకుడు వజ్రసింహాసనాధిపతియైనట్లు చెప్పియున్నది. 'రా. ౨' సంజ్ఞకుడు రాజశేఖరరాయలు. విద్యారణ్య కాలజ్ఞానమున చెప్పినట్లు వాస్తవముగ రాజశేఖర రాయలు సామ్రాజ్యమును పాలించినట్లు శాసనములు నిరూపించుచున్నవి. రాజశేఖరరాయలు మల్లికార్జునరాయల పుత్రుడు. ఇతడు సామ్రాజ్యాధిపతియైనట్లు శాసనములందున్నను విద్యానగరమునుండి రాజ్యపాలన మొనర్చినట్లు గపడదు. దక్షిణ ఆర్కాటుమండలమున గానవచ్చు సాళువ నరసింగరాయల శాసనముల యందే రాజశేఖరరాయల పేరగపడుటవల్లను, సాళువ నరసింగరాయ లిమ్మడి విరూపాక్ష రాయలకు బద్ధశత్రువగుటవల్లను దన తండ్రిని వధించి యిమ్మడి విరూపాక్షుడు రాజధాని నాక్రమించుకొనిన పిమ్మట రాజశేఖరుడు విద్యానగరమునుండి పారిపోయి సాళువ నరసింగ రాయల యందజేరినట్లును, నతడిట్లు వచ్చిన రాజకుమారుని కాశ్రయ మొసగి యతనిని చక్రవర్తిగ బ్రకటించినట్లును, దోచుచున్నది. రాజశేఖర రాయల చరిత్రను గూర్చి యింతకంటె విశేషాంశము లెవ్వియు దెలియ రాకపోయినను, నతడు పుత్రవంతుడై కొంతకాలము కావేరీ తీరమున నుండెనని యచట గానవచ్చు నితని సంతతివారి శాసనములను బట్టి యూహించుట కవకాశము గలదు.

## ఇమ్మడి విరూపాక్షరాయలు

(క్రీ. శ. ౧౪౬౫-౧౪౭౫)

మల్లికార్జునరాయలను వధించి, యతని పినతండ్రి ప్రతాపదేవరాయల కుమారు డిమ్మడి విరూపాక్షరాయలు సింహాసనము నాక్రమించు కొనెనని పూర్వప్రకరణమున వివరింపబడి యున్నది. అతనికి కార్య మెట్లు సానుకూలపడెనో స్పష్టముగ దెలియదు. గజపతి సామంతులతో నతనికి గొంత మైత్రి యుండినట్లు శాసనములందు సూచనలు గానవచ్చుచున్నవి. ఒకవేళ నతడు గజపతి కపిలేశ్వరు నాశ్రయించి యాతని సహాయమును బొంది, ప్రసన్నామృతము జెప్పిన విధమున రాయలను వధించి రాజ్యము నాక్రమించుకొని యుండిన నుండవచ్చును. ఇది పట్టి యూహ కాదు. ఇమ్మడి విరూపాక్షుడు శక్తిసామర్థ్యములు గల ప్రభువు గాడు: అయినను, ఇతని రాజ్యకాలమున మొదటి నైదేండ్ల యందును- అనగా, గజపతి కపిలేశ్వరుడు బతికియున్నంత కాలమును—శత్రుభయము లేక

కోల్పుటయు, నటుపిమ్మట నొకప్పుడు పర్వాత్ర యరి మీద యాధికత్యము వహించుటయు జూడగా నిమ్మడి విరూపాక్షుడు గజపతి యాశ్రయము సంపాదించి, యతనిచే సంరక్షితుడై యతని గొడుగు క్రీనీడను రాజ్యమేల గల్గెనని తోచకపోదు. కావున ఇమ్మడి విరూపాక్షుడు గజపతుల సాయము వల్ల సింహాసనము నాక్రమించుకొన గల్గెనను నభిప్రాయము యుక్తమైనదే.

ఇమ్మడి విరూపాక్ష రాయ లిట్లు సింహాసనము నాక్రమించుకొన్నను, సామ్రాజ్య మంతయు నతనికి స్వాధీనపడలేదు. సామంతు లనేకులు రాయలను లక్ష్యపెట్టక రాష్ట్రపాలన సేయ దొడగిరి. వీరిలో ముఖ్యముగ పేర్కొనదగిన వారు సాళువ వంశజులు. గుండప్పకమ్మ మొదలు కావేరీతటము వఱకు గల సముద్రతీర దేశమంతయు చాల భాగము వీరి యధికారమునకు లోబడి యుండినది; మఱియు, దక్షిణకర్ణాటమున కొంత భాగముకూడ వీరి పాలనయందే యుండినది. నామ మాత్రము సాళువరాజులు రాయల యధికారము నంగీకరించినను, వను యేలుబడిక్రింది రాష్ట్రమును స్వతంత్ర ప్రభువులవలె ఇచ్చవచ్చినట్లు పాలింపగడగిరి. రాజశేఖర రాయలును వకని సంతతివారును మధుర, తంజాపుర, తిరుచినాపల్లి, కోయంబుత్తూరు, సేలము జిల్లాలలో చాల భాగమును స్వతంత్రముగ నేల నారంభించిరి. అట్లే తుళువ కొంకణ సామంతులు రాయలను సరకు సేయక పశ్చిమ సముద్రతీర భూములయందు యథేచ్ఛగ ప్రవర్తింప గడగిరి. మిగిలి యుండినది కడుసంకుచితమైన రాష్ట్రము అందిమిడియుండిన కర్ణాట పశ్చిమాంధ్రములందు మాత్రము విరూపాక్షరాయల యధికారము చెల్లుచుండినది.

ఇమ్మడి విరూపాక్షరాయల రాజ్యకాలము రెండు భాగములుగ విభక్తమగుచున్నది. క్రీ.శ. ౧౪౬౫ మొదలు ౧౪౭౦ వఱకు గడచిన మొదటి యైదేండ్ల కాలమున విశేషించి చెప్పదగిన చరిత్రాంశము లెవ్వియు గానరావు. ఈకాలమున వ్రాయబడిన శాసనములను బరిశీలించి చూడగా సామ్రాజ్యమంతఃకలహములచేగాని వైదేశికదండయాత్రలవల్లగాని కలతనొందక శాంతముగ నుండె ననియు, రాష్ట్రపాలన యథాపూర్వము నిరాటంకముగ సాగుచుండెననియు దెలియవచ్చు చున్నది. కాని యటుపిమ్మట వైదేశికదండయాత్రల వల్లను సామంతుల యుద్రేకమువల్లను శాంతిచెడి దేశము సంక్షుభితమై తుఫాను తాకుడుచే గల గుండువడ్డ సాగరమువలె నల్లకల్లోలమై యుండెను.

క్రీ.శ. ౧౪౭౦-వ సంవత్సరమున కపిలేశ్వరుడు మృతినందిన కొలదికాలమునకు దక్కను రాజ్యములందు రాజకీయ వాతావరణము పరివర్తనముగ మార నారంభించినది. బహమనీ సుల్తానుల యుద్రేకము హెచ్చినది; వారి రాష్ట్రము బహుళముగ విస్తరించి పూర్వ పశ్చిమ సముద్రములను దాకినది. ప్రప్రథమున వారి దృష్టి పశ్చిమ సముద్ర తీర దేశముపై బడినది; గోవా మొదలగు ధనసంపన్నములగు రేవుపట్టణముల నాక్రమించుకొనవలయునని చిరకాలమునుండి వారు యత్నములు సల్పుచుండిరి; కాని కపిలేశ్వరుడు జీవించియున్నంత కాలమును బహమనీసుల్తానునకు విజయనగర సామ్రాజ్యముపైకి ఎత్తిపోవ ధైర్యము లేకపోయెను. అతని మరణవార్త వినినోడగనే భయవిముక్తుడై కొంకణ దేశముపై దండువెడలెను. దండు వెడలుటకు బహమనీ సుల్తానుకొక చక్కని సాకు దొరకినది. పశ్చిమతీర సముద్ర తీరమందలి ముఖ్యరేవుపట్టణములలో నొకటి యగు భటకళపురమున నశ్వవ్యాపారమే ప్రధానవృత్తిగ జీవనము సల్పు మహమ్మదీయ వర్తకు లనేకులు నివసించుచుండిరి. వీరు విజయనగర సామ్రాజ్యమునకు జెందిన రేవుపట్టణము నుండి వ్యాపారమును జరుపుచున్నను, దూరమున్న దేశములనుండి దిగుమతి సేయు గుఱ్ఱములను రాయల కమ్మక మతాభిమాన కారణమున బహమనీసుల్తానునకును నతని సర్దారులకును విక్రయించువారు. వీరి ప్రవర్తనను సహింపక విరూపాక్ష రాయలు పలుమారు వీరిని మందలించెను; కాని వారు తమ బుద్ధిని మానరైరి. అందుమీద విరూపాక్షరాయల కలుక పొడమినది. కావున నతడు తన సామంతుడును నగిరి హొన్నావురరాజ్య పాలకుడును నగు మహామండలేశ్వర భైరవదేవ ఒడయుల కొక్క తురకపురుగును మిగులనీయక సంహరింపవలసినదని నిరూప మంపెను. భైరవ దేవుడు ముందువెనుక లాలోచింపక రాయ నిరూపమును అమలునకు దెచ్చెను; కదివేలమంది

మహమ్మదీయుల ప్రాణములు గోల్పోయిరి; తక్కినవారు గోవారేవుపట్టణమునకు పాఱిపోయి యచట స్థిరనివాసము నేర్పఱచుకొనిరి.

స్వమతస్థులనందఱిని చంపించినందులకు రాయలపై గసితీర్చుకొనుటకొఱకు మల్లిక్-ఉల్-తుజ్జారు ఖ్వాజా-ఇ-జహాను మహమూదు గావానుని ప్రోత్సాహముమీద రెండవ మహమ్మదుశాహాబహమనీ కొంకణమును జయింప నొకగొప్ప సైన్యము నంపెను. మహమ్మదీయ దళముల మొదటి దాడునకు ఖేల్నాప్రభువు శంకరరాయలు గుఱి యాయెను; ఖేల్నాదుర్గము శత్రుదుర్జయమైన వనదుర్గము. దండయాత్రను స్వయముగ నడపుచుండిన మహమూదు గావాను దుర్గమును వశపఱచుకొనుటకు దన యరణభరణ శక్తిని వినియోగించి రెండు సంవత్సరములకాలము పోరెను; తుదకు బలముచే సాధ్యముగాని కార్యమును ధనముచే సాధించెను; విస్తారధనమును దగువారికి లంచములిచ్చి ఖేల్నాను కైవసముగావించుకొన్న పిమ్మట గావాను గోవాపై నెత్తిపోయెను. విరూపాక్షరాయలు గోవాదుర్గసంరక్షకులకుదోడు సైన్యము నంపుచున్నాడని వార్తవచ్చినది. ఆ దండు వచ్చి చేరినపిమ్మట గోవాను సాధించుట సులభమైన కార్యము గాదు; కావున గావాను సత్వరముగ భూనావికాదళములకూర్చుకొని కూచిచేసిపోయి యేకకాలమున నేలనుండియు నీటినుండియు దార్కొనెను; ఆతని కడక సంపూర్ణముగ నెఱవేరెను. ఇరు పార్శ్వములనుండియు నొక్కుమ్మడి పైబడిన తురకల ప్రతాపమున కాగజాలక యచట గాపుండిన తాణ్యము గోవాను తురకలకు వశపఱచిరి.

గోవా శత్రువులకు వశపడుటవలన విజయనగరమునకు చెప్పరాని నష్టము గలిగినది. పశ్చిమ సముద్రతీరమందలి రేవుపట్టణములలో నెల్ల నది ముఖ్యతమమైనది. వర్తక నావల రాకపోకలకది చాల సానుకూల మగుటవలన యూరపాఫ్రికా పశ్చిమాసియాలనుండి వచ్చు సరకులన్నియు నచటికే వచ్చెడివి. మఱియు, దక్షిణ భారతమునుండి పశ్చిమదేశముల కెగుమతియగు వస్తుసామగ్రి యంతయు నా రేవు పట్టణము నుండియే యెగుమతి యయ్యెడివి; ఎగుమతి దిగుమతి వ్యాపారములవల్ల నపారధనము రాయ భండారమునకు జమయయ్యెడిది. గోవా శత్రుహస్తగతమగుటవలన రాయ సంస్థానమునకు వచ్చు వరుంబడి తరుగుటయే కాక, రాయ రాణువకు వలసిన గుఱ్ఱములుగూడ లభ్యపడక పోయినవి. తత్కారణమున రాయ సైన్యబలము సన్నగిలెను.

ఇమ్మడి విరూపాక్షరాయలు గోవాను గోల్పడుట కియ్యకొనలేదు; దానిని మరల స్వాధీనము జేసికొనుటకు రెండుమారులు ప్రయత్నమొనర్చెను. తురకలు గోవాను జయించిన తరువాత రెండేండ్లకతని యాజ్ఞమీద బెల్గాము దుర్గాధిపతియగు వీరకన్న రాయడు, బంకాపుర ప్రభువుతోడు నడువగా, గోవాపై నెత్తిపోయెను; అంతటనిమ్మడి మహమ్మదుశాహు మహమూదు గావాను మున్నగు సర్దారులు గొలువ గొప్ప సేనతో గదలివచ్చి బెల్గామును ముట్టడించెను. వీర కన్నరాయడు యావచ్ఛక్తిని వినియోగించి తన కోటను గాపాడుకొన ప్రయత్నించినను, తుదకతడు సుల్తాను బలమునకు లొంగి బహమనీ సామంత మండలిలో జేరవలసివచ్చెను. వీర కన్న రాయని యోటమితో గోవా దండయాత్ర భగ్నమైపోయినది; బహమనీ సుల్తానుని యధికారము మునుపటికంటె నచట దృఢతర మాయెను. కాని విరూపాక్షరాయలు దన యత్నము నంకట మానుకొనలేదు. క్రీ. శ. ౧౪౮౧ వ సంవత్సరమున సుల్తాను, మహమూదు గావానునకు మరణదండన విధించిన పిమ్మట, బహమనీ రాజ్యమున గొంత సంక్షోభము గలిగినది. సమయ మనుకూల పడునని తలచినాడేమొ విరూపాక్షరాయలు గోవాను జయించుటకు పునఃప్రయత్నము గావించెను. అప్పుడు, సుల్తానిమ్మడి మహమ్మదుశాహు బెల్గాము దుర్గమున విడిసియుండి, తన ముఖ్య సర్దారులలో నొకడైన యూసూఫు ఆదిల్ ఖానుని గోవా సంరక్షణార్థము నియోగించెను. ఆదిల్ ఖానుడు గోవాను సంరక్షించుట కేమి చేసెనో తెలుపగల సాధనము లెవ్వియు లభ్యపడలేదు; కాని శత్రువుల నిర్జించి యాదిల్ ఖానుడు గోవాను గాపాడెననుటకు సంశయము లేదు. ఇలన, బహమనీ ఫౌజా లటుపిమ్మట విజయనగర సామ్రాజ్యాంతర్గతమైన తుళువ రాజ్యమును జయించుటకు ప్రయత్నమొనర్చె

వ్వట్లు శాసనములవల్ల దెలియవచ్చు చున్నది. బహామనీ సామంతులలో నొక్కడగు బీదరె సుల్తాను, గోప్రధాన సేనాని (గోఫరీదూన్ కైజరు ఖాను) తన సేనాధిపతి యగు నిజాముద్దీను మలుకను సైన్యముతో గూడ తులువ రాజ్యము లోని నగిరెవహోన్నాపుర సంస్థానమును జయించుట కంపెను. ఈ యుద్ధయాత్ర యెట్లు పర్యవసానమునందెనో తెలియదు; నగిరె హోన్నాపుర ప్రభువులు మహమ్మదీయుల నోడించి తఱుము గొట్టిరట్లున్నది. కాని మహామూదు గావానుని సమరకృత్యముల మూలమున పశ్చిమ తీరమందలి కొంకణము మాత్రమే కాక యుత్తరకర్ణాటములో చాలభాగము రాయల చేతినుండి దుసికిలిపోయినది; మరల మహారాష్ట్రమున శివాజీ యవతార మెత్తువఱకును మరల నీదేశము హిందువుల యేలుబడి క్రిందికి రాలేదు.

కపిలేశ్వరగజపతి గతించిన పిమ్మట, గజపతి రాజ్యమున సంభవించిన యంతఃకలహముల మూలమున తీరాంధ్రదేశమున గొప్ప సంక్షోభము గలిగెను. అతని పుత్రులలో నంబిక నామాంతరుడగు హంవీరునకును, పురుషోత్తమునకును రాజ్యాధిపత్యము కొఱకు కలహము సంప్రాప్తమైనది. హంవీరుడు సుప్రసిద్ధ దళనాయకుడు; అతని కృషిమూలముననె గజపతి సామ్రాజ్య మాంధ్రదేశమున విస్తరించినది: కపిలేశ్వరుడు పురుషోత్తముని దనవెనుక రాజ్యాధిపతిగ నియమించి, క్రీ.శ. ౧౪౭౨ నుండియును రాజ్యవ్యవహారముల నన్నిటిని నతని ముఖాంతరముగనె జరుపుచుండెను. అన్నదమ్ము లిద్దఱి పోరు తీక్ష్ణముగ సాగినది; తత్కారణమువల్ల నాంధ్రదేశమున గజపతుల యధికార పటుత్వము సడలినది. అందువల్ల రాయలకు గజపతి విజయములమూలమున పూర్వము నష్టమైపోయిన రాష్ట్రమును మరల సాధించుటకు మంచి యవకాశము గల్గినది; కాని విరూపాక్షరాయ లాజోలి యెత్తుకొనలేదు.

దైవికముగ నిట్లు సంప్రాప్తమైన యవకాశమును సందుచేసికొని నష్టమైపోయిన రాయ సంస్థానముయొక్క పరువు ప్రతిష్ఠలను పునరుద్ధరించుటకుగాని తన్మూలమున ప్రజానురాగమును బడయుటకుగాని యతడు ప్రయత్నము చేయలేదు. విరూపాక్షరాయల యౌదాసీన్యము సాళువ నరసింగరాజాభ్యుదయమునకు గారణభూతమాయెను; అతడు రాయసామంతులలో ప్రముఖుడు; రాయల యెల్లమి నాక్కరము జేసికొని యతడు రాయసామ్రాజ్య సంరక్షణదక్షుడై ప్రబలెను.

సాళువ నరసింహరాజు చంద్రగిరి దుర్గాధిపతియగు సాళువ గుండరాజుయొక్క జ్యేష్ఠ పుత్రుడు; క్రీ. శ. ౧౪౫౬వ సంవత్సరమున గద్దె నెక్కినట్లున్నది. అతడు సింహాసనము నధిష్ఠించినపుడు విశ్వవైశాలమైన చంద్రగిరి దుర్గమును దక్షిణ ఆర్కాటు మండలములోని నగర ప్రాంతమునుమాత్రమే యతనియేలుబడియందుండెను నతని యధికార మంత గొప్పదికాదు; కాని యప్పటి రాజకీయ స్థితిగతు లతని యభివృద్ధికి దోడ్పడినవి. అతడు గద్దె నెక్కుట కించుక ముందు గణదేవునిచే మల్లికార్జునరాయలు పరాభూతుడై కొండవీటి రాజ్యమును గోల్పోయెను; ఈ యపజయమువల్లను రాజ్య నష్టమువల్లను కేంద్ర ప్రభుత్వముయొక్క పటుత్వము చెడి బలము క్షీణింప నారంభించినది. సమయ మిట్లనుకూలపడగా సాళువనరసింహరాజు ఇరుగుపొరుగు సామంతులను జయించి వారిపై దన యధికారము నెలకొల్పసాగెను; దినదినప్రవర్ధమానమై పెంపందుచుండిన నరసింహుని రాజ్యపరాక్రమములను గని శంకించి క్రీ. శ. ౧౪౮౫వ సంవత్సరమున మల్లికార్జునరాయలును మహాప్రధాన తిమ్మణ్ణ దండనాయకుడును రాజధానినుండి పోయి నరసింగరాజు రాజ్యవ్యవహారములను విచారించుచు [illegible]ంత కాలము పెనుగొండయందు నివసించుచుండిరి; కాని యంతమాత్రమున నాతని యాటోపము దగ్గినది కాదు. పెనుగొండయందు నిజమహాప్రధానితో గూడ రాయల నివాసమువలన నేమి ప్రయోజనము కలిగెనో చెప్పుటకు సాధ్యము గాదు. సామ్రాజ్యముపై దరతరముగ నెత్తివచ్చు గజపతి దండయాత్రలవలన చాల యలజడి కలిగి శాంతికి భంగము గలిగెను. క్రీ. శ. ౧౪౭౧ వ సంవత్సరమున వచ్చిన హంవీరుని దండయాత్ర కొనసాగకపోయినను, నటుపిమ్మట [illegible]ండేండ్లకు క్రీ. శ. ౧౪౭౩ వ సంవత్సరమున నెత్తివచ్చిన కుమార కపిలేశ్వర మహాపాత్రుని ధాటి జయప్రదముగ

పరచెను. ఈ యుద్ధయాత్రలవల్ల నప్పటికే నశ్వ హీనమైయుండిన కేంద్రప్రభుత్వము మఱింత దుర్బలస్థితికి వచ్చినది. మల్లికార్జున రాయల వధయు, సొడ్డైవారి సహాయముతో విరూపాక్ష రాయల రాజ్యసమాక్రమణమును సామ్రాజ్య విచ్ఛిత్తికి దోహదప్రాయమైనవి. నాయకులును దొరలును నామకార్థము రాయలయధికారము నంగీకరించుచు వచ్చినను, ఎవ్వరి కిష్టమువచ్చినట్లు వారు ప్రవర్తింపసాగిరి. దేశమున నిట్టిరాజక స్థితులు ప్రబలియుండిన సమయమున సాళువ నర సింహరాజు తన యధికారమునకు దృఢముగు పురాములను నిర్మించుకొనెను. విరూపాక్ష రాయలు సింహాసనము నధిష్ఠించునప్పటికె యతడు చిత్తూరార్కాటు ద్వయజిల్లాల మండ లముపై దనయధికారమును నెలకొల్పెను. గొప్ప బలమును గూర్చుకొని రాయలకు ప్రతిద్వంద్వి యై వర్ధిల్లెను. అతని మాఱ్కొన జాలిన బలశాలి రాయసామ్రాజ్యమున లేడాయె; కావుననే యతడు విరూపాక్షుని ధిక్కరించి మల్లికార్జున రాయల పుత్రుడగు రాజశేఖరరాయలను జేరదీసి తనయాస్థానమున నాశ్రయ మొసగగల్గెను.

(సశేషము)



కథానిక

# ఆఘ్రాత పుష్పం

'జయంతి'

సరోజ పేదకుటుంబంలో పుట్టింది. పేదతనం ఉగ్గుపాలతో జీర్ణింపచేసుకుంది.

"సరూ! మీ తండ్రిని నాశనం చేసి మనల్ని ఈ స్థితికి తీసుకు వచ్చిన దారిద్ర్యాన్ని మనం జయించాలి. అదే మన జీవిత లక్ష్యం. ఎంత త్యాగం చేసినాసరే మనం ధనికుల మవాలి" అని తల్లిచేర్పిన చిన్ననాటి పాఠం ఆమెలో గాఢంగా నాటుకుపోయింది. చదువు చదివి, ఆ లక్ష్యాన్ని సాధించా లనుకుంది.

సరోజ అపూర్వ సుందరి. ఆమె నేత్ర గోళాలు ఎట్టి అంధకారంలో నైనా ధగ ధగ లాడుతాయి. చిరుముంగురులు ఎంత పిల్లగాలి కైనా రెపరెప లాడుతాయి. పలువరుసలు ఎంత చిన్నమాటకైనా తళతళ మెరుస్తాయి. ఇక భానుమూర్తి సంగతి చెప్పనే అక్కర లేదు. అతడు ప్రథముడుగా రాని పరీక్ష లేదు. చక్కని పద్యాలు రాస్తాడు. పాతకొత్తల మేలు కలయిక అతని కలానికి శ్రీరామరక్ష. కొత్త కవులతన్ని కోవిదు దంటారు. పాత కవులతన్ని 'భాయీ' అంటారు. అందుకే జగమెరిగిన రసజ్ఞులంతా అతన్ని మెచ్చుకుంటారు. విద్యార్థి దశలోనే ఇంత పేరు సంపాదించుకున్న భానుమూర్తి ఒక నాడు మహాకవి కాగలిగే సూచన లున్నాయని జోస్యం చెబుతారు, తెలిసినవారూ తెలియని వారూ కూడాను.

ఆనాటప్పుడు ఒకే తరగతిలో చదువు తూన్న సరోజ, భాను పరస్పరం సన్నిహితు లవడంలో ఆగమాజ మేమిటి? సరోజా భాను మూర్తీ తరచు మాట్లాడుకుంటుండేవారు. అతడు ప్రతీ ఆదివారం ఆమె బసకు వెళ్ళి చూస్తుండే వాడు. ఇద్దరూ లోకపురీతులు, సమాజం నిర్మిం చిన చట్టాలు గురించి చర్చించుకునేవారు సరోజ మానవజీవితం సుఖవంతం కావడానికి ధనం అత్యవసర మనేది. భానుమూర్తి 'ధనం అవ సరం కాని, అత్యవసరం కాదు' అని వాదించే వాడు. సరోజ తన భావాలనే నమ్ముకుని కించ పడుతుండేది. కాలప్రవాహంలో రెండేళ్లు గడి చాయి. పరీక్ష లయిపోయాక ఎవరి యిండ్లకు వాళ్లు పోతున్నారు. భానుమూర్తి సరోజను కై లెక్కించాడు. ఆమెకళ్లలోకి దీర్ఘంగా చూస్తున్నాడు. మూర్తీభవించిన సౌందర్య దేవ తలా ఆమె వెలుగుతూంది.

"సరోజా- ఎప్పుడు మన కలయిక?" అన్నాడు, అప్రయత్నంగా.

"నీ భావం నాకు తెలియలేదు," అంది సరోజ.

"శాశ్వతమైన కలయిక; ఎన్నడూ విడిపడక కాలపుటంచులకి తేలిపోయే ఐక్య జీవితం..."

"భానూ! క్షమించు. నా వివాహం నిశ్చయమైపోయింది. ఒక ధనికునితో, ఈనెలలోనే. మా అమ్మ నిశ్చయం చేసింది."

భానుమూర్తిమీద పిడుగుపడినట్లయింది. ప్రపంచంలోని అమంగళాల బృందగానం తన ముందు మ్రోగినట్లయింది. సరోజకుకూడా పెద్ద యేడుపు వచ్చింది. ఏదో చెబుదామనుకుంది, కాని గొంతు మ్రోగలేదు. ఒక ఉత్తరంమాత్రం తీసి ఇచ్చింది. నిర్ఘాంతపోతూ అలాగే చదువుతున్నాడు.

"సరూ! నీ వివాహం రాజారావుతో నిశ్చయించాము. అతనికీ, భానుమూర్తికీ ఆర్థిక స్థితిగతులలో ఉన్న తేడా నీకు తెలుసునుగదా! భానుమూర్తినుండి నిన్ను దూరం చేస్తున్నందుకు విచారిస్తున్నాను కాని, అది నీమంచికోసమే తల్లీ!"

సరోజ మళ్లీ ఉత్తరం అందుకుంది. "బాబూ! రైలు కదులుతోంది. వెనక్కి వుండండి" అన్నాడొక పోర్టరు భానుమూర్తితో. ఇంతలో బండి కదిలింది. సరోజ వెర్రిగా చూసింది.

"భానూ! తప్పక వస్తావుగదూ నా పెళ్లికి" అనిమాత్రం అనగలిగింది.

"అలాగేలే, బ్రతికివుంటే" అన్నాడతడు. రైలు వెళ్లిన రెండు నిమిషాలదాకా భానుమూర్తి రుమాలు వూపుతూనే వున్నాడు ఎవరికో—ఎందుకో.

సరోజకూ రాజారావుకూ పెళ్లి జరిగింది. భానుమూర్తి మాత్రం తరలిరాలేదు. రాజారావు శ్రీమంతులపుత్రుడు. వ్యాపారంలో వేలాది ఆర్జించగలడు; పందేలలో అంతకుమించి ఓడిపోగలడు. బిచ్చగాండ్రకు కాసీ యివ్వకుండా పోగుచెయ్యగలడు; రత్నాలు మ్రింగే రంగేళీ మిత్రులను పోషించగలడు. లోకపు దృష్టిలో అతడు అదృష్టవంతుడు. సరోజలో ఎట్టిమార్పూ రాలేదు. రాజారావుని అర్థం చేసుకుందుకు అహోరాత్రాలు ఆమెకృషి చేసింది. అతనిలోని దుష్టబుద్ధుల్ని నిర్మూలించడానికి ప్రయత్నించింది. కాని రానురాను ఆ ప్రయత్నాలు ఫలరూపం దాల్చలేదు. రాజారావు సరోజను చూచి మొదట్లో మురిసిపోయేవాడు. నలుగురూ ఆమెసౌందర్యాన్ని కొనియాడుతూంటే మైమరచేవాడు. అతని ప్రేమ వ్యామోహ రూపంగానే వుండిపోయింది. ఆమెతో మాత్రం ఎన్నడూ ఆంతరంగిక విషయాలు ముచ్చటించలేదు. ఆ ప్రస్తావన ఎన్నడూ ఆమె చెయ్యడాన్ని సహించనూ లేదు. రెండేళ్లు గడిచాక రంగులు మారేయి. సరోజమీద వ్యామోహం చల్లారినకొద్దీ ఆమెను కేవలం క్రీడావస్తువుగా చూసి ఇతర సమయాలలో ఆమె ప్రసక్తి అంటేనే విముఖత్వం చూపేవాడు. సరోజకు అటునుండీ రాజారావుమీద మనస్సు లగ్నం కాలేదు. ఆమె నడవడిక సామాన్యమైనదే. అది వైవాహిక స్త్రీకి సమాజం రాసిపెట్టిన ధర్మమాత్రమే. ఇన్నాళ్లూ ఓర్పు, ఓర్పుతో ఆ ధర్మాన్ని పాటిస్తూవచ్చింది సరోజ. కాని, అది రానురాను దుర్భరమయింది. అతడు తనను భార్యగా చూడకపోవడంవల్ల ఆమెలో విరక్తి జనించింది. పైగా అతడు ఇంకో ఇద్దరు స్త్రీలతో రహస్య ప్రణయం నడుపుతున్నట్లు చూచాయగా తెలియవచ్చింది. అట్టివానితో తన కలయిక కేవలం వ్యభిచారం గాక మరేమిటని తనలో తాను దిగులు పొందింది. ఆఖరి సారిగా అతని తీరున్నిగురించి మాట్లాడుతూ మందలించ చూసింది. కాని అది నిష్ఫలం. రాజారావు ఉగ్రుడై "ఇక నీకూ నాకూ సంబంధం లేదు" అని ఇంటినుండి వెళ్ళగొట్టేడు. ఆమె ఏమాత్రం చలించలేదు.

స్వస్థలానికి తిరిగివచ్చి సరోజ మళ్ళీ చదువు ప్రారంభించింది. దివారాత్రాలు నిద్రాహారాలు మరచి విద్యాదీక్షను స్వీకరించింది. తన సర్వస్వాన్ని ధారపోసి యం. బి. బి. యస్! పూర్తిచేసుకుంది. ఇన్నాళ్లూ ఆమె రాజారావుకు

గురించి తలపోయనూ లేదు; భానుమూర్తిని మరచిపోనూ లేదు. భానుమూర్తిని గురించిన చింతన ఛాయలా ఆమెను వెన్నంటేది. సాయంత్రం ఎక్కడ ఏకాంతప్రదేశంలో కూర్చున్నా, అతని మాటలు ఆమెను కలవరపెట్టేవి. అతన్ని గురించి ఎందరినో అడిగింది. కాని, ఎవ్వరూ సరిగా చెప్ప లేక పోయారు. ఒక స్నేహితుడు మాత్రం ఇలా అన్నాడు, "అతనికి పిచ్చిఎత్తినట్లు చూచాయగా తెలిసింది" అని. ఒక స్నేహితురాలు రాసింది: "భానుమూర్తి మనోవ్యాధితో కాలధర్మం పొందినట్లు ఎవరో అన్నారు" అని. అంతే. మళ్ళీ ఎవర్నీ అడగలేదు సరోజ ఆ విషయం, అలాంటి మాటలు వినదలుచుకోనూ లేదు. కాని, ఏ జనసమూహాన్ని చూసినా ఏదో పోగొట్టుకున్నట్లు ఆమె కళ్లు వెదుకుతూంటాయి. ఏపద్యాలు చదివినా కవిపేరు తెలిసేదాకా ఒకే తహతహ.

చదువు పూర్తిచేసుకుని సరోజ వైద్యశాల పెట్టుకుంది. అచిరకాలంలోనే ఆమె ఝల్లు ఘులసుల లాడింది. ఒక ఆపరేషనుకు మెచ్చుకుని జమీందారు కారు కొనియిచ్చాడు. రెండు సంవత్సరాలలోనే దివ్యభవనం తయారయింది. ఏమూలచూసినా ఆమెపేరు పేద సాదలలో మ్రోగిపోయింది. శ్రీమంతు లెందరో ఆమె క్రీగంటి చూపుకై కలలు కనేవారు. ఆమె ముందు మోకరిల్లి సర్వం అర్పణ చెయ్యడానికి సిద్ధపడేవారు. ఆమె యౌవనపు టుద్రేకాలను వైద్యసేవలో మరచిపోయేది. చిత్త చాంచల్యం కలగబోయే కొన్ని బలహీనపు ఘడియల్లో భానుమూర్తి జ్ఞాపకంవచ్చి "నీమనస్సు రాతి సుమా!" అనేవాడు. సమాజంలో ఆమెకు లభించిన ఉన్నతస్థానం ఎంతమాత్రం భానుమూర్తిని ఆమె స్మృతిపథాలనుండి దూరం చేయలేకపోయింది. అయినా, సమాజం ఆమె శీలాన్ని శంకించింది. ఆమెపైన ఎన్నో కల్పనాకథలు అల్లబడి ప్రచారాన్ని పొందేయి. ఇదికూడా ఆమె కేమాత్రం విచలిత పరచలేదు. "ఈర్ష్యాపరు లేకాలంలో లేరు!" అని ఆమె సమాధానం చెప్పుకునేది. రాగారాగా ఆమెలో కలిగిన విచారం ఒకటే. "నాకు వివాహమనేదే జరిగి వుండక పోతే ఎంత బాగుండేది!" అనుకునేది అస్తమానం.

రోజూ కూర్చున్నట్టే సరోజ ఆవేళ సాయంత్రం దేవాలయం ఎదుట ఒంటరిగా కూర్చుంది. విజయదశమి కనక వేలాదిజనులు లోపలికి వెడుతున్నారు దేవీదర్శనానికి. తోసుకు వస్తూన్న కెరటాలలాగ ఎందరెందరో బయటకు వస్తున్నారు. స్త్రీలు నేత్రోత్సవంగా ధూపదీపాలు తీసుకు వెడుతున్నారు. సరోజ పక్కవాటుగా జనసందోహాన్ని చూస్తోంది. దూరాన వెలిగే విద్యుత్కాంతులు ఆమె కళ్ళలో ధగధగా మెరుస్తున్నాయి. ఆమె మెడలోని ముత్యాలహారం వెర్రిగా నవ్వుతూంది-తన విలువ నెవ్వరూ అక్కడ పాటించలేదన్నట్టు. సిగలో ముడిచిన గులాబీలు స్వేచ్ఛని కోల్పోయినట్టు వ్యథపడుతున్నాయి. ఆమె కట్టుకున్న పసుపు రంగు పట్టుచీర ఆమె శరీరకాంతితో లీనమై తన ప్రత్యేకతని కోల్పోయినందుకు కించపడుతోంది.

గుడిలో మ్రోగే గంటలశబ్దం ఆమెగుండెల్లో ప్రతిధ్వనిస్తోంటే ఆమె దీర్ఘంగా ఆలోచిస్తోంది. రెప్పవెయ్యని ఆ దృష్టిలో జీవితరంగాలు తిరుగుతున్నాయి. ధనపిపాస యొక్క నినాదం, ధనగర్వ విలాసం, నిష్కళంక ప్రేమ యొక్క నిర్వికార ప్రవృత్తి, లోకమర్యాదలలోని ఆడంబరత, మానసిక శాంతియొక్క మహోన్నత స్థానం— ఇవే ఆ కావ్యంలో తిరుగుతూన్న రంగులు. ఈ ఆలోచనలలో సరోజ శరీరాన్ని మరచి పోయింది తనచుట్టూ విప్పారిన నిస్సహాయత, నిస్పృహ కూడా ఆమె పొందే ఏకాగ్రతను భంగపరచలేక పోయాయి. ఆ క్షణంలో ఆమె ప్రకృతిలోని తన అణురూపాన్ని గుర్తించుకుని సుఖదుఃఖాల కతీతమైన శాంతి పొందుతూంది. ఇంతలో చిన్ననాటి స్నేహితురాలు రాధ భర్తతో దూరాన పోతూ, భర్తను అక్కడ ఆపి సరోజను సమీపించింది.

"ఏమిటి సరోజమ్మా! అలా దీర్ఘంగా ఆలోచిస్తున్నావు" అంది.

"ఏముంది రాధా! 'అఘ్రాత పుష్పాలు దేవతార్చనకి అర్హాలు కావు' అన్న చిన్ననాటి పాఠాన్ని పునశ్చరణ చేసుకుంటున్నాను" అంది సరోజ పరధ్యానంగా.

# సోషలిస్టుల విదేశాంగనీతి

నారాయణ ప్రసాద్

బాపూజీ పాశ్చాత్య జాతుల మనస్తత్వం పూర్తిగా అవగాహన చేసుకున్నాడు. మొదటి ప్రపంచ యుద్ధం వచ్చినప్పుడు పాశ్చాత్యులమీద ఆయనకు నమ్మకం ఉండేది. యుద్ధమవగానే స్వాతంత్ర్య మిస్తామన్న ఇంగ్లీషువారికి అండగా నిలబడవలెనని పట్టుబట్టి భారతదేశాన్ని మొదటి ప్రపంచయుద్ధంలో దిగేట్టుగా చేశాడు. యుద్ధం అయిపోయింది. ఇంగ్లీషువారు చేసిన వాగ్దానాన్ని నిలబెట్టుకో లేకపోగా భారతీయులను భారీయెత్తున జైళ్ళలో వేసేసరికి గాంధీజీకి పాశ్చాత్యులమీద నమ్మకం పోయింది.

రెండవ ప్రపంచయుద్ధం వచ్చింది. ఏమైనా సరే యుద్ధానికి సహాయం చేయకూడదని పట్టు పట్టాడు. దాని పర్యవసానం భారతదేశానికి స్వాతంత్ర్యం తీసుకురాగల్గాడు. కాని ఈరోజు ఇండియా గవర్నమెంటు గాంధీజీ అనుభవాన్ని సైతం మరచిపోయింది. కామన్‌వెల్తులో ఉండే సాధకబాధకాలను యోచించలేకపోయింది. గత్యంతరంలేక ఇంగ్లీషువారు అమెరికాలో చేసుకొన్న ఆర్థిక ఒడంబడికవల్ల మనకూ ఇంగ్లీషువారికీ ఉన్న కామన్‌వెల్తు సంబంధం మరింత బిగిసింది. దాని ఫలితం మనదేశంకూడా ఆర్థిక క్షోభకి గురికాబోతూ ఉన్నది. పాకిస్తాన్ బెదురు, కలకత్తా జూట్ మిల్ యజమానుల గుండెదడ, లక్షలాది కార్మికుల నిరుద్యోగం, ఎన్నో ఎన్నో అలవికాని బాధలు.

ఇంతేకాదు. ఒక ఇంగ్లీషు ప్రజల విషయంలో గాదు. కాశ్మీర్ విషయంలో మధ్యవర్తి సంస్థ కమాండరుగా వచ్చిన డెల్వాయ్ చర్య చూడండి. తిన్నయింటి వాసాలు లెక్కపెట్టినట్లుంది. మేజర్ జనరల్ తిమ్మయ్య అతని కాపురానికి ఇచ్చిన గృహం - కాశ్మీరుకు వ్యతిరేకంగా ప్రవర్తించి, కాశ్మీరుపై యుద్ధం చేసిన పాకిస్తాన్‌లో కాపురముంటున్న సర్దార్ ఎఫ్[illegible] ఇది తెలిసికూడా ఆయన ఏం చేశాడు? కాశ్మీరులోని ధనరాసులను సేకరించి పాకిస్తానుకు చేరవేశాడు. ఇది మొత్తపు పాశ్చాత్యుల నైజంగా కనబడుతుంది.

ఈ సత్యాన్ని ప్రస్తుతం ఒక సోషలిస్టు పార్టీయే గమనించినట్లు కనబడుతున్నది. వారు ఈమధ్య ప్రకటించిన విదేశాంగ విధానం చాలా సమంజసమని తోస్తున్నది. ప్రస్తుతమున్న రెండు గ్రూపులతో చేరడం సమంజసం కాదని, మూడవగ్రూపు ఒకటి తయారుచేయడం సమంజసమనీ అన్నారు. దీనిని "హిందూపత్రిక" సంపాదకీయంలో విమర్శించారు. ఇందులో దేనితో చేరినా ఒకటి రెండవదానిమీద యుద్ధం ప్రకటించినపుడు ఆయా గ్రూపులలో వుండు రాజ్యాలు సైతం యుద్ధం ప్రకటించవలసినదే గదా! దీనివల్ల కలిగే నష్టం అపారం. కాబట్టి మూడవ గ్రూపును తయారుచేసి శాంతి స్థాపించుటే ప్రధానమని సోషలిస్టుపార్టీ చెప్పడం ఎంతో సమంజసంగా ఉంది. పోతే మిత్రరాజ్యసమితిలో సభ్యులుగా ఎందుకు ఉండవలెనని "హిందూ" పత్రిక అదే సంపాదకీయంలో విమర్శించింది. ప్రపంచంలోని అన్ని రాజ్యాలూ అందులో ఇంతవరకూ సభ్యులుగా ఉన్నవి. మనదేశం కూడా అందులో మెంబరుగా ఉంటేనే తప్ప సాముదాయిక రక్షణ జరుగుట కష్టం. రేపు మూడవ ప్రపంచయుద్ధం వచ్చేయెడల ఈసమితి యిప్పటివలె వుండదు. అప్పుడు తప్పక రెండు కూటాలు ఏర్పడతాయి. లేక ప్రస్తుతం ఉండు రెండు గ్రూపులు ఆదర్శ భేదాలచేత రెండుగా విడిపోవచ్చును. హిందూదేశం కూడా తన మూడవ కూటం ఇప్పుడు ఏర్పరచుకొంటే అప్పుడు బలపర్చుకొనడానికి అవకాశమేర్పడుతుంది. ఇది చాలా సమంజసంగా ఉంది

ఇట్టి నిర్ణయం చేసిన సోషలిస్టు పార్టీ బాపూజీ ఆశయమార్గాన్ని నడుస్తున్నదని చెప్పటంలో ఏం సందేహం లేదు.

# జనవాక్యం

సంపాదకునికి ప్రకటనార్థం పంపించిన లేఖలు యీశీర్షికక్రింద ప్రచురితమవుతాయి. లేఖలు క్లుప్తంగా, కాగితానికి ఒక పక్క వ్రాసి పంపాలి.

---

## స్టేట్ కాంగ్రెస్ ఎన్నికలు - ప్రజల కర్తవ్యం

స్టేట్ కాంగ్రెస్ ఎన్నికలు కొద్దిరోజుల్లో జరుగనున్నవి. ప్రజానాయకులమనే పేరుతో వ్యవహరించుతూ ప్రజలకే విఘాతాల్ని కల్పిస్తూన్నవారు, మళ్లీ ఇప్పుడు ఆప్రజల కాళ్ళవద్దకే రావలసి వస్తూన్నది. వారి ఉపన్యాసాల్లో, ప్రతి మాటలోకూడా ప్రజాస్వామిక సూత్రాల్ని వల్లిస్తూన్నారు. ప్రజల కెంతో మేలు చేస్తామని డబ్బాలు వాయిస్తూ మళ్ళీ తమనే ఎన్నుకోవలసిందిగా విపరీతప్రచారం సాగిస్తూన్నారు. రకరకాల బురకారాయుళ్లు, స్వార్థపరులు కాంగ్రెస్‌లో స్థానాలకోసం నిలబడుతున్నారు. కాని, ప్రజల్లో వీరికిగల విలువను వీరు గుర్తుతీసుకోవటం లేదు. కేవలం స్వార్థంకోసం ప్రజల త్యాగాన్ని బలిపెట్టాలని చూస్తూన్న నాయకత్వం హైదరాబాద్ ప్రజలు సహించకూడదు.

ప్రస్తుతం ప్రజలు తమ కర్తవ్యాన్ని నెరవేర్చటంలో అతి జాగ్రత్తతో వుండాలి.

బ్రాహ్మణ, అబ్రాహ్మణ విభేదాల్ని రెచ్చగొడుతూ, ఆ ప్రచారంద్వారా నాయకత్వం సంపాదించ జూస్తూన్నవారిని ప్రజలు గమనించాలి. ప్రతి పౌరుడూకూడా తన ఓటును సద్వినియోగమయ్యేట్లు చూడాలి. నిజంగా హైదరాబాద్ పౌరుల కిది పరీక్షాసమయం. వారు తమ త్యాగానికి ఫలం దక్కేట్టు చేసుకోవాలంటే పైరకాలతో నిండివున్న నాయకుల్ని కాంగ్రెస్ నుంచి దూరం చేయాలి.

కలకోట — వాశిరెడ్డి భద్రయ్య

---

## ఒరిస్సాలో ఆంధ్రుల స్థితి

కోరాపుట్టి జిల్లా జయపురం హైస్కూలులో తెలుగు పిల్లలు నూటికి నల్భై అయిదుగురికి తక్కువలేరు. గాని ఈ సంవత్సరం స్కూలు క్వార్టర్లీ పరీక్షలను ఆ 9 వ క్లాసుకు ఇంగ్లీషు 1 వ పేపరిస్తూ, ఒక చమత్కారము ప్రదర్శింపబడింది. ఈ క్రిందివానిని ఇంగ్లీషులోనికి తర్జుమా చేయుము అన్నది ప్రశ్న: మీద 5 ఒరియా వాక్యాలు, క్రిందను దేవనాగరిలిపిలో 5 తెలుగు వాక్యాలు ఇవ్వబడ్డాయి. ఒరియా పిల్లలు ఒరియా వాక్యాలు ఇంగ్లీషులోనికి తర్జుమాచేస్తే తెలుగుపిల్లలు తమ మాతృభాషా వాక్యాలు దేవనాగరిలిపిలో నున్నవి ఇంగ్లీషులోనికి తర్జుమా చెయ్యాలట. ఏ ద్విభాషా ప్రాంతంలోనైనా ఈ చిత్రం చూచారా! ఇది ఒరిస్సాలో మేము పొందుచున్న గౌరవం.

గుణుపురం — ప్రసూరాజు సన్యాసిరాజు

భాషా రాష్ట్రసమితి-ఆంధ్రశాఖ

కార్యవర్గ సభ్యుడు

## రేడియో-హైస్కూలు కార్యక్రమాలు

ఆలిండియా రేడియోవారు యిదివరకు కన్న యెక్కువ హైస్కూలు విద్యార్థులకు, మిడిల్ స్కూలు విద్యార్థులకు కార్యక్రమాలు పెంచి ప్రసారం చేయడం చాలా ముదావహం. కాని అదే సమయాలలో హైస్కూళ్లు, మిడిల్ స్కూళ్లలో పాఠాలు జరుగుచుండుటచేత విద్యార్థులు చాల నిరుత్సాహ పడుతున్నారు. అసలే రేడియోలు తక్కువ, అందులో విద్యార్థుల కొరకై ప్రసారం చేయబడు కార్యక్రమం విన లేకపోవుట. ఆలిండియా రేడియో వారిది గుర్తించి యీవిధంగా మారిస్తే బాగుంటుందని నా అభిప్రాయం:

హైస్కూళ్ళకు ఉదయం 8½ నుండి 9 గంటలవరకు, మిడిల్ స్కూళ్ళకు ఉదయం 9 నుండి 9½ గంటలవరకు.

ఇదికాక నెలవురోజాలలో వారు కార్యక్రమ ప్రసారం అపు చేస్తున్నారు. విద్యార్థులు తీరికగా వినుటకుగాను సెలవులలోకూడా ప్రసారం చేస్తే బాగుంటుంది.

ముస్తాబాదా పి. వి. రామారావు

---

## విజువల్ ఎడ్యుకేషన్ ఫిలిమ్స్

మన రాష్ట్రంలో అన్ని సెకండరీ విద్యాలయాల్లోనూ యీ 'యథార్థ విద్యా ప్రబోధాత్మక చిత్రములు' (visual education films) చూపింతుమని ప్రభుత్వంవారు ప్రతి విద్యార్థి నుండీ నిరుటి సంవత్సరం, ఈ సంవత్సరం రెండేసి రూపాయల ప్రకారం వసూలు చేసినారు. నిరుటి సంవత్సరం ఫిలిమ్స్ పాఠశాలల్లో చూపించకపోగా, ఈ సంవత్సరమైనా కనుచూపు మేరలో అవి వచ్చునట్లు కనబడదు.

ప్రభుత్వం వారు నిష్కారణంగా, అందరి దగ్గరా వసూలు చేసిన నిరుటి సంవత్సరపు పైకం వాపసు యివ్వాలి. ఈ సంవత్సరం త్వరలోనే ఫిలింలు, ప్రొజెక్టరులు అన్ని విద్యాలయాలకు అందజేయవలెను. కానిపక్షములో, నిర్వర్తింపలేని కార్యమునకు పూనుకొనుట, ప్రభుత్వ విద్యాశాఖాధికారుల చేతకాని తనము వెల్లడించు నటుటకు సందేహం లేదు. విద్యార్థులనుండి వసూలు చేసిన పైకమునకు కొంతలో కొంతవరకైనా లాభము చూపించని అధికారులు విమర్శకు పాత్రులు కారా?

తాడిపత్రి రంగం

---

## రైల్వే అధికారుల కొక సలహా

ఆంధ్రదేశానికి ముఖ్య వ్యాపార కేంద్రం విజయవాడ. ఎగుమతులు, దిగుమతులు విపరీతంగా జరుగుతూ వుంటాయి. రైల్వేమూర్గాన, పడవల ద్వారా, లారీలద్వారా, బండ్లద్వారా, అనేక విధాలా వ్యాపారం జరుగుతూ వుంటుంది. గూడ్సు షెడ్డులు రెండు వున్నాయి. ఇవి గాక పార్సిల్ ఆఫీసు ఒకటి వున్నది. ఈ మూడింటిలోనూ-పార్సిల్స్ డెలివరీ చేసుకోవటానికి గంటల తరబడి, యితరపనులను చెడగొట్టుకొని వుండవలసి వస్తోంది.

దీని మూలంగా వ్యాపారస్థులకు చాలా కష్టంగా వున్నది. కాబట్టి మద్రాస్ నగరంలో మాదిరిగా, "హోం డెలివరీ" పద్ధతి ఈ వూరు నందుకూడా పెడితే చాలా బాగా వుంటుంది. దీనివలన వ్యాపారస్థులకూ, అటు రైల్వేవారికీ అన్నివిధాలా సమపాయంగా వుంటుంది.

దీనితోపాటు గవర్నరుపేట సెంటరులో టవున్ బుకింగ్ ఆఫీసుకూడా ఒకటి పెట్టినట్టయితే ప్రయాణీకులకు ఎంతో సౌకర్యం.

విజయవాడ బి. యల్. దేశపాండే